చిత్రకళాప్రచురణ — 4    వెల : **0-12-0**

మార్చి 1951

* ఓటీసలీమా

* మేఘమల్లార్

* బరువు

* సౌందర్యదేవత

అనువాదం: 'కేరా'

చిత్రకళాప్రచురణలు
సత్యనారాయణపురం,
విజయవాడ—2

కిసాన్ ప్రెస్
విజయవాడ

# బిబి సలీమా

వేసవి కాలపు రోజులు. ఆ ఫాల్గుణంలోనే పాదుషా కొత్తగా సలీమాను పెళ్ళి చేసుకున్నాడు. రాజ్యాంగపు జంజాటం అంతా వదిలిపెట్టి... కొత్త పెళ్ళికూతురుతో సుఖంగా ప్రేమమయ జీవితాన్ని గడుపుదామనే కాశ్మీర్ విలాస భవనానికి వచ్చాడు.

రేయి పాలలో స్నానంచేస్తోంది, దూరపు పర్వత శిఖరాలమంచుతో... ఉద్యానవనంలోని మహాలు ప్రక్కనుంచే మంచునది ప్రవహిస్తోంది.

మోతీమహల్ లోని ఆ గదిలో సుగంధపువత్తి వెలుగుతోంది. ఆ తెరచిన కిటికీ దగ్గర కూర్చొని, సలీమా రాత్రిపూట సౌందర్యాన్ని చూస్తోంది. విడిపోయిన తలకట్టు లేత గులాబిరంగు శాలువామీద ఆడుకుంటోంది. కుట్టుపని ప్రావీణ్యతఅంతా ఆ శాలువా మీద కుట్టబడిన ముత్యాలద్వారా, ఆ అంగర మీద ఉన్న ముత్యాల —దంశ వలన వెల్లడిఅవుతున్నది. సలీమా దేహచ్ఛాయ కూడ సరిగ్గా ముత్యంలాగ తెల్లగాఉంది. అలంకరణ సామాన్యం. చలువ రాతితో సమానంగా ఉన్న ఆ పాదాలని, జరీకుట్టు చెప్పులు ... వాటిమీద మిలమిల మెరుస్తూన్న వజ్రాలు...అందంగా ముచ్చటగా కాపాడుతున్నాయి.

గదిలో నేలమీద విలువైన తివాచీ పరచిఉంది. దానిమీద కాలు పెట్టటమే తడవుగా ... మెత్తగా క్రిందికి దిగిపోతుంది. సుగంధ ద్రవ్యాలతో నిర్మించబడిన ప్రమిద మండుతూనేఉంది. నాలుగు అద్దాలు గదిలో యథాస్థానాలలో ఉన్నాయి. చలువరాతి స్తంభాలపై, బంగారు, వెండి గిన్నెలలో తాజాపూలు పెట్టి ఉన్నాయి. గోడలు, దర్వాజాలుమీద, చంప, నాగకేసర పూలమాలలు వ్రేలాడుతున్నాయి ... వాటి సువాసన గది అంతా వ్యాపించి పోయింది. స్వదేశీ విదేశీ కళను వ్యక్త పరచే వస్తువులు ఎన్నో గది నిండా అలంకరించబడ్డాయి.

రెండు రోజులయింది పాదుషా వేటకివెళ్ళి ... ఇంతే రాత్రి అయినా యింకా తిరిగి రాలేదు. సలీమా వెన్నెట్లో దృష్టిసారించి పాదుషా రాక

* [illegible]

యవ్వనం ... విచారం రెండూ సహింపరానంత వేడిమిని కలిగించుట వల్ల ... కప్పుకున్న ఆ శాలువాను కూడా తీసి పారవేసింది. విసుక్కుంటూ "ఏం బాగుంటుందా? ఏం చెయ్యను?" గట్టిగా అరిచింది. దగ్గర్లో ఉన్న వీణతీసి, రెండు మూడుసార్లు దానిమీదికి వేళ్ళను పోనిచ్చినా ... స్వరం పలకటం లేదు.

గొణుగుకుంటు అంది— "ఘనత ఏలాగా యిదికూడా స్వాధీనం కాకుండా పోయిందే?" దాన్ని అక్కడే పారవేసి పిలిచింది, దాసీ వచ్చి నిలబడింది.

దాసి మంచి అందకత్తె...పదహారేండ్లకలదే. దాని అందంలో జీర్ణించిపోయిన విచారం...కళ్ళలో నిరాశారేఖలు ప్రస్ఫుటమవుతున్నాయి. దగ్గరకూర్చోబెట్టి సలీమా అంది. "సాకీ...నీకు ఏం బాగుంటుందా...ముసలీయా..."

"ప్రభువులకి యిష్టం ఏదో అదే"

"కాని నీకు ఎందులో ఆనందం దొరుకుతుంది" సలీమా అడిగింది.

దాసి కంపిత స్వరంతో "మాకు ఆనందం ఏమిటమ్మా" అంది.

నిమిషంపాటు సలీమా దాసి మొగంవైపు చూసింది. ఆ దేవివిషాదం... నిరాశ...వ్యాకులత...వీటికలయిక గోచరిస్తోంది.

"నిన్ను దాసీదానిలాగా నేను చూస్తున్నానా?" అంది సలీమా.

"లేదు...తమకు యీ దాసీదానిమీద అపారమైన దయ ఉంది"

"ఐతే నువ్వు యింత విచారంతో ... ఒంటరిగా ఎందుకుంటావు? నువ్వు నౌకరుగా యిక్కడికి వచ్చినప్పటినుంచీ అలాగే చూస్తున్నా...సంగతి ఏమిటో నాతో చెప్పు సాకీ..."

దగ్గరకు జరిగి సలీమా దాసి చెయ్యిపట్టుకుంది.

దాసి కంపించి పోయింది... కాని జవాబు యివ్వలా.

సలీమా అంది "నీ కష్టం ఏమిటో నాతో చెప్పు...యింత విచారంగా ఎందుకని ఉంటావు...?"

దాసి వణుకుతూ "తమరు అంత విచారంగా ఎందుకు ఉన్నారు?" అంది.

"పాదుషా యిక్కడికి చాలా తక్కువగా వస్తున్నారు. అందుకనే కాస్త విచారంగా ఉంటుంది."

"ప్రియమైన వస్తువు దొరకనప్పుడు ప్రతివారికీ విచారంగానే ఉంటుంది. నీవ భాగ్యవంతుల హృదయాలు అన్నీ ఒకటేగా..." దాసి జవాబిచ్చింది.

నవ్వింది సలీమా__"తెలిసిందిలే...ఐతే నీకు ఎవరు కావాలి? అతని పేరు నాకు చెప్పు ... పెళ్ళి చేయిస్తాను"

సాకీ తల తిరిగిపోయింది. ఒక్కసారిగా బేగమ్ కళ్ళతో తన కళ్ళను కలిపి అంది "మీరు కావాలి"

సలీమా నవ్వలేక అలసిపోయింది. ఆనవ్వులో దాసీ కంపి నటా చూడలా ... మురళీ తీసుకుని "ఏం పాడమంటారు" అంది సాకీ...

సలీమా అంది "ఆగు ... గది అంతా వేడిగా ఉన్నట్లు ఉంది. అన్ని కిటికీలు తెరచివెయ్యి ... దీపాలు ఆర్పేయి...వెన్నెలని అనుభవించనియ్యి... ఆ పూలదండలు నాదగ్గర పెట్టు."

దాసీది లేచింది...సలీమా అంది "ఇదిగో ... ముందుగా ఒక గ్లాసెడు పానీయం తీసుకురా ... చాలా దాహంగా ఉంది."

బంగారు గ్లాసులో సుగంధ షర్బతు తీసుకు వచ్చింది. "ఓ ... చాలా వేడిగా ఉంది ... ఇందులో గులాబ్ వెయ్యలా?"

దాసీది అంది "వేసాను బేగమ్ సాహెబా"

"ఇంకొంచెం కలుపు"

సాకీ గ్లాసు తీసుకుని రెండవ గదిలోకి పోయింది. చెప్పిన వస్తువు కలిపింది ... అదీ కాకుండా అదనంగా యింకొకటి కలిపింది. ఆ సుగంధ పానీయం బేగమ్‌కు తెచ్చి యిచ్చింది.

ఒక్క గుక్కలో త్రాగివేసి సలీమా అంది "ఆ యిప్పుడు వినిపించు... నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా నవ్వావు కాదూ ... ఐతే మంచి పాట ఒకటి వినిపించు"

గ్లాసు తివాసీ మీదకు దొర్లించి ఆపరుపు మీదనే మత్తుతో ప్రక్కకు వత్తిగిలింది సలీమా. నిషా కళ్ళతో సాకీవైపు చూస్తోంది. సాకీ పాట మొదలు పెట్టింది.

"ముఝ్ వా మై జానే కహాఁ హోంకీ సజనీ"

చాలా సేపటివరకు మురళి స్వరం .. సాకీ కంఠస్వరం విషాద గీతాన్ని ఆలాపన చేసింది. యవ్వన ఉద్ధృతంతో సాకీ ఊగిసలాడుతోంది.

పాట ప్రారంభం చేసి సాకీ చూసింది... సలీమా నిద్రలో వుంది. మత్తుపానీయం కారణంగా సలీమా గొంతు ఎండిపోయింది. ఊండిఊండి గులాబీ పెదవులు కంపిస్తున్నాయ్. శ్వాసలోని సువాసన గది అంతా వ్యాపించి ఉంది. చల్లటి పిల్లగాలికి లేత ఆకు కంపించినట్టుగా, సలీమా వక్షస్థలం నెమ్మది నెమ్మదిగా కంపిస్తోంది. మొగంమీద చెమటబిందువులు, ఆ వెలుగులో ముత్యాల లాగా మెరుస్తున్నాయి.

మురళి ప్రక్కన పెట్టి సాకీ బేగమ్ దగ్గరకి వచ్చి నిలబడిపోయింది. శరీరం వణికింది... కళ్ళు మండ నారంభించాయి. గొంతుక ఎండిపోయింది. తన పైట చెంగుతో మొగంమీద చెమట బిందువులు తుడిచి, ఆ తర్వాత సలీమా మీదికి వంగి పెదవుల్ని ముద్దుపెట్టుకుంది.

వెంటనే కళ్ళు ప్రక్కకుతిప్పి చూసింది. స్వయంగా పాదుషా నిలబడి యీ పనిని ఆశ్చర్యంతో, కోపంతో చూస్తున్నాడు.

సాకీకి పాము కాటువేసినట్టనిపించింది.

"ఎవరు నువ్వు? నువుచేసేపని ఏమిటి?" _ పాదుషా అడిగాడు.

సాకీ మాట్లాడకుండా నిలబడిపోయింది. "జవాబు చెప్పు" పాదుషా రెట్టించాడు.

సాకీ నెమ్మదిగా అంది "జహాపనా ... యీ నిర్భాగ్యురాలు జవాబు యివ్వకపోతే_"

పాదుషాకి ఆవేశం కల్గింది. దాసీదానికి యింత గర్వమా?

"నామాటకు...జవాబు...నిన్ను వివస్త్రను చేసి కొరడాతో బాదిస్తా"

సాకీ దృఢస్వరంతో అంది_ "నేను మగవాడ్ని"

పాదుషా కళ్ళల్లో అగ్నికణాలు గోచరించాయి. సాకీ వైపు స్థిర దృష్టితో చూసాడు. సలీమాని చూసాడు _ స్పృహలేకుండా నిద్రపోతోంది. ఆదే విధంగా ఆమె యవ్వనం బహిరంగమై ఉంది.

కఠోర స్వరంతో పిలిచాడు పాదుషా _ "మాదుమ్"

నిమిషంలో భయంకరమైన అండకత్తె తార్తారు యువతి హాజరయింది. వంగి సలాంచేసింది. "వీడ్ని తీసుకుపొయ్యి గుహలోపారెయ్యి... ఆవిధంగా ఆకలితో చావవలసిందే_"

తన కఠినమైన చేతులతో ఆ తార్తారు యువతి సాకీని తీసుకు పోయింది. కొంచెం సేపటిలో యిద్దరూ ఒక తలుపు దగ్గరికి వచ్చారు. తార్తారీ తలుపు తీసింది...ఖైదీని లోపలికి నెట్టింది. గదిలో నిబ్బల ఖైదీ బయపడటంతోటే నెమ్మదిగా క్రిందకి జారటం మొదలు పెట్టింది.

# 2

తెల్లవారింతర్వాత సలీమా మత్తు వదలిపోయింది. ఉలిక్కిపడిలేచి తల కట్టు, ముసుగు సవరించుకుంది. గుండీ పెట్టుకోటానికి అద్దం దగ్గరకివచ్చి నిలబడి చూసింది. తలుపులన్నీ వేసి ఉన్నాయి. సలీమా పిలిచింది– "సాకీ... ఓ సాకీ...ఉక్కగాఉంది, కిటికీ తెరువు...దరిద్రపునిద్ర యివ్వాళ ఆవహించింది పానీయం కొంచెం ఎక్కువయింది–"

ఎవ్వరూ జవాబు యివ్వలా, సలీమా, యింకాగట్టిగా పిలిచింది "సాకీ–"

జవాబురాలా సలీమా విసిగిపోయి స్వయంగా కిటికీలు తెరవబోయింది. కాని అవి బయటవైపున మూసిఉన్నాయి. సలీమా ఆశ్చర్యంతో తనలోతానే అనుకుంది "అసలు ఏం జరిగిందో...దాసీలంతా ఏమైపోయారు."

తలుపువైపుకు నడిచివెళ్ళింది. తార్తారు యువతి కత్తిపుచ్చుకుని పారా యిస్తోంది. బీబీని చూడటంతోటే తలవంచుకుంది.

సలీమా కోపంతో – "మీరంతా యిక్కడ ఎందుకున్నారు?"

"పాదుషా ఆజ్ఞ"

"ఏం...పాదుషా వచ్చారా?"

"అవునండీ"

"నాకెందుకు తెలియపరచలేదు?"

"ఆజ్ఞ లేదు"

"ఎక్కడున్నారు?"

"జీనత్ మహల్ – అంతఃపురంలో"

సలీమాకి కోపం వచ్చింది – అనుకున్నది. "అందం వెంటపడేవాళ్ళకి ప్రేమవిలువ ఏం తెలుస్తుంది...ఐతే జీనత్ మహల్ అదృష్టం పండింది–"

తార్తరీ స్త్రీ మాట్లాడకుండా ఊరుకుంది – "నా సాకీ ఎక్కడ?"

“ఖైదులో”

“ఎందుకని?”

“పాదుషా ఆజ్ఞ”

“దాని నేరం ఏమిటి?”

“చెప్పకూడదు”

“ఖైదు తాళం చెవులు ఇలా యియ్యి – నేను విడిపించుకువస్తాను”

“మీరు మీగది దాటి పోవటానికి సెలవు లేదు”

“ఐతే నేకూడా ఖైదీనన్నమాట”

“చిత్రం”

సలీమా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తిరిగివచ్చి కూర్చుంది. వెక్కి వెక్కి ఏడ్చింది... ఆఖరికి ఒక ఉత్తరం వ్రాయటం ప్రారంభించింది.

హుజూర్ – నాతప్పు క్షమించండి. పగలల్లా అలసిపోయి ఉండటం వల్ల వళ్ళుమరచి నిద్రపోయాను. ప్రభువుల ఆహ్వానించలేకపోయా... అదీ కాకుండా నా ప్రియ దాసీదాని ప్రాణాలను కూడా రక్షించండి... ప్రభువులు వస్తున్నారనే విషయం నాకు చెప్పకుండా అదిగొప్ప నేరం చేసింది. కాని అది కొత్తగా వచ్చింది— బీద దుఃఖిత స్త్రీ – – దాసీ సలీమా

... ... ...

ఉత్తరం పాదుషా దగ్గరికి పంపబడింది. పాదుషా మనస్సు స్థిమితంలేదు... యావద్భారతదేశపు పాదుషా భార్య కులటగా తయారయింది... పాదుషా స్వయంగా తనకళ్ళతో తన బేగమ్‌ని పరపురుషుడు ముద్దుపెట్టుకుంటూ ఉన్న దృశ్యం చూసాడు. కోపంతో తికమక పడుతున్నాడు... హృదయశాంతి కోసం పానీయం త్రాగవలసి వస్తోంది. సమయంచూసి జీనత్ సవతి మీద రెండు మూడు కల్పించి చెపుతోంది. తార్తారిని చూసి పాదుషా అడిగాడు “ఏమిటి తీసుకువచ్చావు”

దాసి విన్నవించింది – ‘ప్రభూ... సలీమాబీబీ అర్జీ...’

ఉత్తరం ముందుపెట్టింది. పాదుషా కోపంతో పెదవులు అణచి అన్నాడు – “చావమన్నానని... ఆమెతో చెప్పు”

ఉత్తరం నెట్టివేసి మొగం ప్రక్కకి తిప్పుకున్నాడు.

దాసీ తిరిగి వెళ్ళిపోయింది. పాదుషా జవాబు విని సలీమా ఒక్కసారిగా కూర్చుండిపోయింది... దాసీని బయిటికి పొమ్మంది...తలుపులన్నీ వేసి వెక్కి వెక్కి ఏడ్వటం ప్రారంభించింది. గంటలు గడచిపోయాయి...పగలు గడచిపోతోంది__

సలీమా అనుకుంది_"పాదుషాలకే బీబీ లవటంకూడా ఎంత దురదృష్టం...ఎదురుచూసి చూసి ప్రాణం విసిగిపోయింది...ప్రార్థించి కంఠం శోషించిపోవాలి...వంగి నమస్కారాలు చేస్తూ శరీరం ముక్కలైపోవాలి. ఇన్ని చేసినా...యీ కొద్ది విషయానికి...నిద్రహాయి వాయ వచ్చినపుడు లేపనందుకు యింతటి శిక్ష__యింతటి అగౌరవం?

"అటువంటప్పుడు నేను బేగమ్ని ఏమయ్యాను? జీనత్...దాసీలు వింటే ఏమంటారు? ఇంత అగౌరవం జరిగినతర్వాత మళ్ళీ మొగం చూపించటం ఎట్లా? ఇప్పుడు చచ్చిపోతేనే మంచిది...దురదృష్టవంతురాల్ని...బీదరైతు భార్యనన్నా అయ్యానుకాదు..."

నెమ్మది నెమ్మదిగా స్త్రీత్వపు ఆవేశం ఆమె హృదయంలో ప్రబలింది. అభిమానం...ప్రతిజ్ఞ చిహ్నాలు కళ్లను ఆవరించాయి. ఆవేశంతో ఉత్తరం ప్రారంభించింది.

ప్రభూ...మీ భార్యను. దాసీని అవటంవల్ల తమ ఆజ్ఞని నెరవేరుస్తున్నా. ఇంతటి అగౌరవం పొందినతర్వాత చావటమే మంచిది. కాని యిటువంటి గొప్ప ప్రభువు తన భార్యల్ని ఎందుకూ పనికిరాని వస్తువులుగా చూడటం అంత మంచిదికాదు. మామూలు పొరపాటుకు యింతటిశిక్షా_నాతప్పు అల్లా వళ్ళు మరచి నిద్రపోవటమేగా _ సరే కాని ఆఖరిసారి ప్రభువుని ఒక్కసారి సందర్శించాలని ఉంది...ఆ భగవంతుడి దగ్గరకు పోయి...నా భర్తను సుఖంగా కాపాడమని ప్రార్థిస్తాను."

- సలీమా

ఉత్తరాన్ని అత్తరుతో, సుగంధం కలదానినిగాచేసి పూలగుత్తిలో వెంటనే దృష్టిలో పడకుండా ఉండేటట్టుగా అలంకరించి పంపింది. నగల పెట్టె లోనించి...విలువైన ఉంగరం తీసి కొంచెంసేపటివరకు దానిపై తీక్షణంగా చూసింది...దాన్ని నమిలివేసింది.

# 3

సాయంకాలం చల్లగాలికోసం పాదుషా ఉద్యానవనంలోకి వచ్చాడు. ఇద్దరు – ముగ్గురు ఖోజాలు గాబరాగా పరుగెత్తుకు వచ్చి...ఉత్తరం యిస్తూ చెప్పారు "హుజూర్...ఆశ్చర్యంగా జరిగింది...సలీమా బీబీ విషం తింది— చనిపోతూ ఉంది..."

పాదుషా ఉత్తరం చదివాడు. తొందరగా సలీమా మహల్ ప్రవేశించాడు. ప్రియురాలు నేలమీద పడి ఉంది...కంటి గ్రుడ్లు పైకి పోతున్నాయి. దేహచ్ఛాయ నల్లగా బొగ్గులా తయారయింది. పాదుషా యిక సహించలేకపోయాడు. తొందరపాటుతో అన్నాడు– "వైద్యుడు...పిలవండి" ఎంతోమంది పరుగెత్తుకుపోయారు.

పాదుషా కంఠస్వరం విని సలీమా ఆయనవైపుచూసి అంది — "అదృష్టం –"

"పాదుషా బీబీకి యిటువంటి నేరం తగందేనా?" సలీమా చాలా బాధతో అంది "ప్రభూ...మామూలు నేరం"

పాదుషా తీవ్రంగా అన్నాడు – "దురదృష్టం – మహలులో వేషం మార్చి పురుషుడ్ని పెట్టుకోవటం మామూలు నేరం...చెవుల మీద...ఆ మాటలు విని ఎప్పుడూ విశ్వసించను..., కాని స్వయంగా కళ్ళతో చూసింది అబద్ధం అని ఎల్లా అనుకోను?"

ఒక్కసారిగా వేలకొలది తేళ్ళు కుట్టినపుడు మనిషి పడినంత బాధ సలీమా అనుభవించింది– అంది "ఏమిటి?"

పాదుషా భయపడి వెనక్కు తగ్గాడు– "నిజంచెప్పు...దేవుడిదగ్గరకిపోయే బాటమీద ఉన్నావ్...ఆ యువకుడు ఎవరో చెప్పు?"

సలీమా సంకోచిస్తూ అంది "ఏ యువకుడు?"

పాదుషా కోపంతో– "సాక్షిగా చేసుకుని నీదగ్గర ఉంచుకున్న మనిషి"

సలీమా గాబరాపడింది– "ఆ...మగవాడా..."

"నీకు ఆ విషయం నిజంగానే తెలియదా?"

సలీమా నోటినుంచి వచ్చింది "నిజంగా"

కళ్ళవెంబడి నీరుప్రవహించింది. సంగతిఅంతా తెలుసుకుంది. "ప్రభూ ఐతే యిక నేనేం విన్నపం చేసుకోను. అటువంటి నేరానికి యీశిక్షతగినదే... నాతప్పు క్షమించండి...అల్లామీద ఒట్టువేసి చెపుతున్నా. యీవిషయం, నాకు తెలియనే తెలియదు..."

పాదుషాకి దుఃఖంపొర్లుకువచ్చింది. "సలీమా నువ్వు నిర్దోషివి..." పాదుషా మొదలుపెట్టాడు...ఏడ్పు.

సలీమా పాదుషాచెయ్యి తనహృదయంమీద పెట్టుకుంది "నాప్రభూ, ఆశించటానికికూడా వీలులేని సుఖం...చనిపోయేటప్పుడు దొరికింది...క్షమించండి...ఈదాసీకోరిక ఒక్కటి నెరవేర్చండి."

"తొందరగాచెప్పు_ సలీమా"

సలీమా సాహసించి అంది, "ఆ యువకుడ్ని క్షమించండి"

సలీమా శరీరం చల్లబడిపోయింది. పాదుషా వంగి ఆమెలలాటాన్ని ముద్దుపెట్టుకుని పిల్లవాడిమాదిరిగా ఏడ్వనారంభించాడు.

# 4

కటికచీకటి. చలిలో ఆ యువకుడు ఆకలితోపడి ఉన్నాడు. ఒక్కసారిగా గట్టిగా శబ్దంచేస్తూ తలుపుతెరచుకుంది. వెలుతురుతోబాటు శబ్దంకూడా గుహలో ప్రతిధ్వనించింది...

"నిర్భాగ్యుడా...ఇంకా స్మృతిఉందా?"

యువకుడు తీవ్రస్వరంతో అన్నాడు. "ఎవరు?" "పాదుషా"

"ఇది పాదుషాలకు తగినచోటుకాదు___ఏం యిలాదయచేసారు?"

"నీ విన్నపం వినలేదు...అది విందామనే వచ్చాను."

కొంచెంసేపు ఆగి యువకుడు చెప్పటం ప్రారంభించాడు___"కేవలం సలీమాను అబద్ధపునిందనుంచి తప్పించటానికే యీవిషయం చెప్పబోతున్నా- వినండి_ సలీమా చిన్నపిల్లగా ఉన్నప్పుడు వాళ్ళతండ్రిదగ్గర నేను నౌకరుగా ఉండేవాణ్ణి. అప్పటినుంచీ నేను ఆమెను ప్రేమిస్తూనే వచ్చాను. సలీమాకూడ ప్రేమించేది...కాని అది చిన్నపిల్లల ప్రేమ...వయస్సువచ్చాక సలీమా ఘోషాలోఉండేది. తర్వాత పాదుషా బీబీఅయింది. కాని నేనుమరచిపోలేక

ఐదుసంవత్సరాలు పిచ్చివాడిలాగ తిరిగాను. శేషంమార్చి దాసీగా తయారయ్యాను. కేవలం ఆమెనుచూస్తూ, ఆమాటలువింటూ జీవితాన్నిగడిపివెయ్యాలని నాఉద్దేశ్యం. ఆరోజున చల్లటివెన్నెల, సుగంధపు పూలు...సారా... ఏకాంతం నన్ను ఉద్రేకపరచాయి. మొగంమీద చెమటబిందువులు కొంగుతో తుడిచి ముద్దుపెట్టుకున్నా...నేను యింతవరకే అపరాధిని...సలీమాకు యీ విషయం ఏమీ తెలియనే తెలియదు." పాదుషా కొంచంసేపటివరకు నిశ్శబ్దంగా నిలబడి, తర్వాత తలుపువెయ్యకుండానే వెళ్ళిపోయాడు.

౫

సలీమా చనిపోయి పదిరోజులయింది. రాత్రింబవళ్ళు సలీమా గదిలోనే పాదుషా గడిపివేస్తున్నాడు. ఎదురుగ్గా నది ఆవలి ఒడ్డున చెట్లనీడను సలీమా సమాధిఉంది. ఏకిటికీదగ్గరయితే సలీమాకూర్చుని రాత్రిపూట తనకోసం నిరీక్షించిందో, ఆకిటికీదగ్గరనే యిప్పుడు పాదుషాకూర్చుని రాత్రి పగలుకూడా సలీమా సమాధినిచూస్తుఉంటాడు. ఎవ్వరూ కూడ దగ్గరిక రావటానికి ఆజ్ఞలేదు. సగంరాత్రి గడచిపోయాక...ఆ నిశ్శబ్ద నిశీథంలో మర్మవేదనను కలిగించేపాట వినిపిస్తూఉంటుంది. పాదుషాకి స్ఫుటంగా వినిపిస్తుంది. ఎవ్వరో కోమలకంఠంతో...కరుణాయుక్తంగా పాడుతూంటారుగా.

"దుఃఖ్ వా కానే కహూఁ మోరీ సజనీ"



విభూతిభూషణ వంద్యోపాధ్యాయ

# మే ఘ మ ల్లా ర్

పరమిత దేవాలయంలో పాములఆట చూడటానికి ఎంతోమంది స్త్రీ పురుషులు గుమిగూడారు. వాళ్ళల్లో ప్రద్యుమ్నుడు ఒకడు.

అది జ్యేష్ఠమాసపు సంక్రాంతి.

నాలుగువైపుల ఊళ్ళనుంచీ, స్త్రీలు దేవీపూజచేయటానికి వచ్చారు. ఈఅవకాశం చూసుకునే మంచిమంచి పాములవాళ్ళు, పందెపుగాళ్ళు తమనేర్పు చూపించటానికి, అక్కడికి చేరుకున్నారు. పువ్వుల వర్తకుడు అనేకరకాల పూలమాలలతో కొమ్మలు అలంకరించి బేరగాళ్ళకోసం ఎదురుచూస్తున్నాడు. మగధదేశాన్నుంచి ఒకవ్యాపారి మంచిచీరెలు తీసుకువచ్చాడు. అందుకనే ఆ కొట్టుమీద ఆడవాళ్ళగుంపు అంత ఎక్కువగాఉంది. దేవాలయంలో సంక్రాంతికి జరిగేఉత్సవానికి గొప్ప వేణుగాయకుడు ఒకాయన వస్తాడని ప్రద్యుమ్నుడు విన్నాడు. ఆయన్ను వెదుకుతూనే దేవాలయంలోకి వెళ్ళాడు. కాని రోజంతా వెదకినప్పటికీ, ఆగాయకుడు కనిపించనేలేదు.

సాయంత్రంపూట గుడిముందు ఒక పాములవాడు పాములఆట చూపించటం ప్రారంభించాడు. చూద్దామనే ఆసక్తి ఉన్న ఆడవాళ్ళంతా అక్కడికి చేరుకున్నారు. ఈవిధంగానే కొద్దిసేపట్లో పెద్దగుంపుఏర్పడిపోయింది. అక్కడ ప్రద్యుమ్నుడుకూడా ఉన్నాడు. కాని అతనిదృష్టి ఆటమీద లేదు. ఆగుంపులో ఒకవ్యక్తికోసం వెదుకుతున్నట్టుగా కనిపిస్తోంది. అతనిచూపులను బట్టిచూస్తే ఆవ్యక్తి వేణుగాయకుడే అయిఉంటాడు. నడివయస్సు మనిషిమీద అతనిదృష్టి పడింది. చినిగిపోయిన మలినవస్త్రాలుధరించి వేరుగా ఒకప్రక్కన నిలబడి ఉన్నాడు. ఎందుచేతనో... కాని అతడే గాయకుడని ప్రద్యుమ్నుని మనస్సుకు తోచింది. గుంపులోంచి దారిచేసుకుంటూ అతనిదగ్గరకు వెళ్ళాలని ప్రద్యుమ్నుడు ప్రయత్నించుతూంటే ఆవ్యక్తి బయటకు రమ్మని సౌంజ్ఞచేశాడు.

ఆ నడివయిస్సువ్యక్తి అడిగాడు___“నన్నేనా నువ్వు వెతుకుతూంది. నేను అవంతీపురపు గాయకుడు సూరదాసుని...”

'తన మనస్సులోని విషయం ఏవిధంగా తెలుసుకోగల్గాడా' అని ప్రద్యుమ్నుడు ఆశ్చర్యపోయాడు. తను అతన్నే వెదుకుతున్నానని చెప్పాడు ప్రద్యుమ్నుడు.

"నిన్ను నేను ఎరుగుదును. ఇదివరలో నీతండ్రితో నాకు మంచిస్నేహం ఉండేది. కాని వెళ్ళినప్పుడల్లా...నీతండ్రిని కలుసుకోకుండా వచ్చేవాణ్ణి కాదు. నిన్ను చిన్నప్పుడు చూశాను. అప్పటికి యింకానువ్వు చాలా చిన్నపిల్లవాడివి" అన్నాడు ఆవ్యక్తి.

"ఇక్కడ మీరు ఎక్కడవుంటున్నారు?"

"నదిఒడ్డున శిధిలమైపోయిన దేవాలయం ఒకటిఉంది...దాన్ని ఎప్పుడన్నా చూశావా?"

"ఆ...యిదివరకు అక్కడ ఒకసన్యాసి వుండేవాడు."

"ఇప్పటికీ ఆయన అక్కడేఉన్నాడు. ఎప్పుడన్నావచ్చి నన్ను అక్కడ కలుసుకో...ప్రస్తుతం నువ్వు ఎక్కడవుండేటం?"

"విహారంలో చదువుకుంటున్నా. మూడుసంవత్సరాలనుంచి వున్నాను. ఇక్కడ యెన్నాళ్లు వుంటారు?"

"నన్ను కలుసుకున్నపుడు చెబుతా, తప్పకుండా కలుసుకుంటావుగా."

ప్రద్యుమ్నుడు నమస్కారంచేసి సెలవుతీసుకున్నాడు.

## 2

ఇంకా సాయంత్రం కానేలేదు. గుడి ఒకచిన్న పర్వతంమీదవుంది. దానికి రెండువైపులా కొండదారివుంది. దీనివెంబడే స్త్రీలు తమయిళ్ళకు తిరిగి వెడుతున్నారు. ఎవరినో వెతుకుతూ ప్రద్యుమ్నుడికళ్ళు ఆడవాళ్ళవైపుకు తిరిగాయి. మళ్లా వారివెనకనే తొందరగా కొండదిగుతున్నాడు. ఆచార్య శీలవ్రతుడు గొప్ప ప్రతిభావంతుడు. ఆయనకు ప్రద్యుమ్నుడి చంచలత్వం...కుతూహలం అన్నీ బాగాతెలుసు. అందుకనే యితర శిష్యులకంటె యితనిమీద ఆయనకు శ్రద్దయెక్కువ...ఇంతరాత్రిపూట ఆలస్యంగావెళ్ళి ఆయనకు ఏమేంజవాబు యివ్వాలి?

మలుపుతిరగటంతోటే పర్వతపుచాటు తగ్గిపోయింది. అంతా మైదానం_ ప్రద్యుమ్నుడు చూశాడు___ నదిఒడ్డున దేవాలయపుశిఖరం మెరుస్తోంది. ఆ శిఖరంమీదుగా మేఘాలతోకూడిన ఆకాశంలో పక్షులు యెగురుతూ తమ గూళ్ళకు పోతున్నాయ్. సరిగ్గా ఆదేసమయంలో అకస్మాత్తుగా యెవరో ప్రద్యుమ్నుడి పైపంచను లాగారు.

ఆశ్చర్యంతో వెనక్కితిరిగి ప్రద్యుమ్నుడు అన్నాడు- "ఎప్పుడొచ్చావ్ సునందా___నీకోసం యెంత వెదికానని...యెక్కడా కనిపించావ్ కాదే"

మొదట్లో ఆయువతిముఖం ఎర్రబడిపోయింది. అభిమానంతో అంది "నన్ను వెదకటానికి తమరు యిక్కడికి వచ్చారా...ఏం? పాముల వైపు మిడుకూ మిడుకూ చూస్తూండటం...నాకు తెలియదా."

"నిజం సునందా! నిన్నుకూడా వెదకాను. మెట్లుదిగుతూన్నపుడూ వెదకాను...ఇప్పుడూ వెదకుతున్నా...ఎవరితో వచ్చావు?"

ఇంతలో కొంతమంది ఆడవాళ్లు ఈవైపుగానే కొండదిగుతూ వస్తున్నారు. వాళ్ళను చూడటంతోనే సునంద...ప్రద్యుమ్నుడ్నివదలి తొందరగా దిగిపోవటం ప్రారంభించింది.

వెనుక [illegible] ఇతర స్త్రీలనుచూచి సునంద వెంటపోవటం మంచిదికాదనుకున్నాడు ప్రద్యుమ్నుడు. కొంచెంసేపు అక్కడనే ఆగి నిరాశతో...క్రిందకు దిగటం ప్రారంభించాడు.

సాయంత్రం గడచిపోయింది. చీకటి వెన్నెలగా పరిణమించింది. కాని అన్యమనస్కుడయిన ప్రద్యుమ్నుడుకి ఇదేం కనిపించలా...స్మృతివచ్చేటప్పటికి పౌర్ణమిచంద్రుని వెన్నెల పిండిఆరబోసినట్లుగా వుంది. ఇక చదువు యేంచదువుతాడు? రేపు ఆచార్య పూర్ణవర్ధనులవారు త్రిపటిక పాఠంగురించి అడిగితే___ జవాబు యేమియిస్తాను? ఆరాత్రి ప్రతిక్షణపు విచారం...అతని హృదయాన్ని కలచివేచింది. అతని స్వచ్ఛందపూరితమైనమనస్సు...ఈజ్యోత్స్నాపూరిత ప్రకృతి వైపు...ఆనందపూరితమైన హృదయంగల స్త్రీలాగ వెంటపడితే...అతను దోషి అని అనగలమా?..

పరమిత దేవాలయంలోని సాయంకాలపు హారతిగంట యింకా మ్రోగలేదు. దూరంగానున్న నదీతీరపు, శిథిలదేవాలయంలోని దీపం మిణుకు మిణుకు

మంటూ కనిపిస్తోంది. ఉత్సవానికి వచ్చినజనం...పండువెన్నెలలో....దూరాన అదృశ్యమైపోయారు.

దానికి దగ్గరగానే ఒక చెట్టుఉంది. దానిదగ్గరకు వెళ్ళగానే చాటున ఎవరో దాగియున్నట్టుగా తోచింది. ఇంకా దగ్గరకు పోగానే పరిచిత కంఠ హాస్యంతో అతడు ఉలిక్కిపడ్డాడు. చూసాడు... సునంద చెట్టుక్రింద నిలబడి వుంది. ఆకుల సందులోనుంచి వెన్నెల సునంద అంగంమీద మాయను వెదజల్లుతోంది. సునంద ప్రద్యుమ్నుడ్ని చూడటంతోనే అంది "ఆ బాగానేఉంది. చెట్టుక్రిందుగా వారివెంట పోతున్నారా లేకపోతే నన్ను వెదకుతున్నారా.."

ఆంతరంగికంగా సంతోషపడ్డాడు. ప్రద్యుమ్నుడు "నిన్ను వెదకుతున్నానా, లేదే...చెట్టుక్రింద దాక్కుని వేళాకోళం ఆడుతున్నావా? నిన్ను చూడకపోతే ఏమయ్యేది? నాకు మంచి కోపంవచ్చింది.... తెలుసా" అన్నాడు ప్రద్యుమ్నుడు.

"తప్పుచేసి పైగా కోపం కూడానా? ఆరోజున ఏం చెప్పారో మీకు జ్ఞాపకంఉందా?" సునంద అంది.

"నీ విషయమే వేరు. భాగ్యవంతుడి కూతురివి...ఆ నువ్వు చెప్పిన విషయం...ఏమిటి?"

"చాల్లెండి అబద్ధం ఆడనక్కరలా...ఆమాట ఏమిటీ...మీరే ఆలోచించండి. అందుకనే అవ్వాళ మాతో మాట్లాడలా..."

ప్రద్యుమ్నుడు కొంచెం సేపు ఆలోచించి అన్నాడు___

"తెలిసింది___ఆమురళి..."

సునంద అభిమాన పూర్వకంగాఅంది. "ఆలోచించి చూడండి. రెండు జాములకే దేవాలయంలోకి వచ్చి కూర్చుంటానన్నారు కాదూ...పైపై మాటలుచెప్పి దాటిపోవాలని చూస్తున్నారా..."

ఈసారి నవ్వాడు ప్రద్యుమ్నుడు "సరే సునందా నన్నుచూసినప్పుడు ఎందుకని పిలవలా?"

'నే నేంఒక్కతెను ఉన్నానుకనుకా...రెండుజాములప్పుడు ఒక్కదాన్నేవచ్చా...కాని అప్పటికి మీరు రానేలేదుగా, ఆ తర్వాత మాఊరి స్నేహితురాళ్ళంతా వచ్చేసారు. మిమ్మల్ని ఎలాపిలవను?'

"నన్నే ఓడించావు...సరేనా...తప్పునాది. మాటి మాటికి పాముల వాడు అంటున్నావ్. నేను వాడివైపు చూడటంలా—అవంతినుంచి మురళీ గాయకుడు రావలసివుంది. మురళి నేర్చుకోవాలని నా అభిలాష నీకు తెలుసుగా...అందుకనే ఆయన కోసం వెదకుతున్నా. ఆయన కనిపించారు కూడాను. ప్రస్తుతం నది ఒడ్డున వున్న దేవాలయంలోనే వున్నారుట...సరే మీ నాన్న గారు ఎక్కడ వున్నారు?"

"మూడు నాలుగు రోజులక్రితం...మహారాజు పిలిస్తే కౌశాంబి వెళ్ళారు"

ప్రద్యుమ్నుడు ఒక్కసారిగా నవ్వి అన్నాడు "అందుకనేనా ఇంత రాత్రయినా నువ్వు యిక్కడ..."

తొందరగా సునంద తన రెండు చేతులతో ప్రద్యుమ్నుడి నోరు మూసింది. "ఊరుకో హారతి అయ్యాక జనం తిరిగివస్తారు. ఆ మాత్రం తెలియదూ?"

నవ్వు ఆపుకుని అన్నాడు ప్రద్యుమ్నుడు "ఈసారి మీ నాన్నగారు వచ్చాక తప్పకుండా చెప్పేస్తా?"

కోపంగా సునంద అంది "చెప్పేయ్...హారతి అయ్యేవరకు దేవాలయంలో వుంటానని వారికి తెలుసుగా..."

మృదువయిన ఎడమ చేతిని తన చేతిలోనికి తీసుకుని అన్నాడు "చెప్పనులే సునందా...మురళీ వినిపించనా...నా దగ్గరనే వుంది. నిజం, చెప్తున్నాగా నీకు వినిపిద్దామనే తీసుకువచ్చా కాని సరిగ్గా వాయించటం నేర్చుకోవటానికే ఆ గాయకుడి కోసం వెదకటం?"

నది ఒడ్డు చేరుకుని హతాశుడైపోయాడు ప్రద్యుమ్నుడు. మురళి వాయించుతూనే వున్నాడు. కాని స్వరం యీ రోజున తప్పిపోతోంది. మనసారా వాయించలేక పోయాడు. ఇంతకుముందు ఎన్నోసార్లు ఏకాంతంలో కూర్చుని మురళీ వాయించి సునందకు వినిపించాడు. ప్రశంసించింది కూడాను. విహారం దాటి పోయేటప్పుడు ఎప్పుడూ ప్రద్యుమ్నుడు మురళీ దగ్గరనే వుంచుకుంటాడు. ఆ మురళి అభ్యాసంలో ఎన్నో సాయంకాలాలు గడిపివేసాడు.

రెండవ రోజున తెల్లవారు ఝామునే ప్రద్యుమ్నుడు నదీ తీరాన దేవాలయానికి వెళ్ళాడు. ఇప్పటికి చాలా రోజుల క్రిందటినుంచి, ఆ గుడిలో విగ్రహం లేకుండా వుంది. గోడలలో పెద్ద పెద్ద పగుళ్ళు ఏర్పడ్డాయి. వాటిమధ్య

పాములు, తేళ్ళు నివాసం ఏర్పరచుకున్నాయి. ఆ గుడికి చుట్టుప్రక్కల ఎన్నో గ్రామాలు వున్నాయి. కాని ఏ గ్రామం నుంచికూడా పొరబాటునయినా ఎవ్వరూ దాని ప్రాంతాలకు రారు. కాని సుమారు ఏడు నెలలనుంచి ఆ దేవాలయంలో ఒక సన్యాసి వుంటున్నాడు. అతనికి యిద్దరు ముగ్గురు శిష్యులు అక్కడికి వస్తూపోతూ వుండటంవల్ల దారిబాగా నలిగినట్టు కనిపిస్తుంది.

వెలుతురు యింకా బాగా రాలేదు. అటువంటప్పుడే సూరదాసు ప్రద్యుమ్నుల కలయిక జరిగింది. సంతోషంతో సూరదాసు అన్నాడు. "పద అవతల కూర్చుందాం లోపల చీకటిగావుంది."

బయట వెలుగులోకి వచ్చి సూరదాసు ప్రద్యుమ్నుణ్ణి పైనుంచి క్రిందవరకు ఒక్కసారి శ్రద్ధగాచూసి మనసులోనే అనుకున్నాడు. "జరుగుతుంది... తప్పకుండా నీ వల్లనే జరుగుతుంది. ఈ విషయం నాకు బాగా తెలుసు"

మొదటిసారిగా సూరదాసును దూరంనుంచి చూసినప్పుడు, ప్రద్యుమ్నుడి మనస్సు అతనిని కలుసుకోటానికి కొంచెంగా వెనుకంజ వేసింది. కాని యీసారి ఆ భావాలన్నీ సమసిపోయాయి. సూరదాసు భీకర ఆకారంలో కూడా లోలోపల్నే ఒక విధమైన ఆకర్షణవుంది. అటువంటిది అన్నివేళలా అందరి మనుష్యులలోనూ దొరకటం అసంభవం.

సూరదాసు అన్నాడు "నువ్వు యీపాటికి వస్తూనే వుంటావనుకున్నా. మీ నాన్న ప్రఖ్యాతగాయకుడు. నీకు ఏమన్నా... సంగీత శాస్త్రంలో ప్రవేశం వుందా?"

సంకోచంతో అన్నాడు ప్రద్యుమ్నుడు—"కొద్దిగా మురళీ వాయించటం అభ్యాసం చేసాను"

"అది స్వాభావికమే! మీ నాన్నను తెలియని వాడంటూ యిక్కడ ఎవ్వరూ లేరు. ప్రత్యేక ఆహ్వానాలువచ్చేవి. నువ్వు మురళీపై మేఘమల్లార్ బాగా వాయించుతావని విన్నానే?" అడిగాడు సూరదాసు.

ప్రద్యుమ్నుడు అతివినయంగా జవాబు యిచ్చాడు—"ఆ విషయం నాకేం తెలియదు. కాని తోచినదేదో ఏదో విధంగా వాయిస్తాను. మేఘమల్లార్ కూడా అప్పుడప్పుడు నా మురళిమీద పాడాను"

"ఎటువంటి అభ్యాసం చేసావో చూస్తాను, ఏదీ ఒకసారి వాయించు"

మురళి ఎప్పుడూ ప్రద్యుమ్నునితో నేవుంటుంది—ఎప్పుడు సునందతో సమావేశం జరుగుతుందో ఎవరికి తెలుసును కనుక.

ప్రద్యుమ్నుడు మురళి వాయించటం ప్రారంభించాడు. తన చిన్నతనంలోనే తండ్రివద్ద నుంచిరాగ ... స్వరాలను గురించి తెలుసుకున్నాడు. అదీకాకుండానే సంగీతం అంటే మంచిఅభిలాషవుంది. కంఠస్వరం అతిమధురం, దానికితోడు ఆలాపనకూడా అద్వితీయం.

ఆకులు, పూలు, పళ్ళు వీటిమధ్యనుంచి వున్నత్త ఆకాశాన్ని జ్యోత్స్న రాత్రిలహృదయాన్ని చీల్చుకుంటూ ఎల్లప్పుడూ భూమిపై ప్రవహించేసుధారి ప్రద్యుమ్నుడి మురళీనుంచి ప్రవహిస్తోంది. ప్రద్యుమ్నుడినుంచి సూరదాసు యింతటి మహత్తును ఆశించలేదు. అందుకనే బిగ్గరగా కౌగలించుకుని అన్నాడు—"ఇంద్రదమనుడి కుమారునికి యిది ఒక పెద్దపని కాదు. నాకు ముందుగానే ఆ విషయం తెలుసు."

తనను ప్రశంసించటం విని ప్రద్యుమ్నుడు సిగ్గుపడ్డాడు.

రెండుమూడు నిమిషాల తర్వాత... తాను తిరిగి పోతానని తెలియజేసాడు. ప్రద్యుమ్నునితో సూరదాసు చెప్పాడు—"ప్రద్యుమ్నా విను నీకు ఒక రహస్యం చెపుతున్నా ఈ రహస్యాన్ని చెప్పటానికే యింతకుముందు నీకోసం ఎన్నోసార్లు వెదకాను... కాని దీన్ని తెలుసుకునేందుకు యితరులకు ఎవ్వరికీ కూడా యీ విషయం చెప్పనని వాగ్దానం చెయ్యాలి."

ఆశ్చర్యపోయాడు ప్రద్యుమ్నుడు... మొదటిసారిగా పరిచయం కలిగిన వ్యక్తితో రహస్యంగా ఉంచుతానని వాగ్దానం చెయ్యదగ్గ రహస్యం ఏది ఉంటుందా అని ఆలోచించటం ప్రారంభించాడు. "కాదు...వినటంవల్ల... ఏమైనా"

మధ్యలోనే సూరదాసు అన్నాడు. "భయపడబోకు—అపాయం కలిగించే విషయం ఏమీ కాదు. అటువంటిదయేటట్లయితే స్వయంగా నేను చెప్పనే చెప్పను."

సూరదాసు చెప్పే విషయం వినటానికి ప్రద్యుమ్నుడు ఎక్కువగా ఆసక్తి పడ్డాడు. రహస్యం యితరులకు చెప్పనని ఆఖరికి ప్రతిజ్ఞ చేసాడు.

సూరదాసు నెమ్మదిగా చెప్పటం ప్రారంభించాడు—"నది ఒడ్డున మైదానం ఎదుట ఉన్న శిథిలదేవాలయం చూసావా? దానిలో యింతకుముందు

ఎంతో కాలంనుంచి సరస్వతీదేవి విగ్రహం ఒకటి ఉండేది. ఈ దేశపు ప్రఖ్యాత గాయకులంతా అప్పట్లో తమ విద్య పూర్తిఅయాక అక్కడికిపోయి పూజచేస్తే కాని తమ సంగీతవృత్తిని ప్రారంభించేవారు కాదు. కాని యిప్పటికి ఆ దేవళం శిథిలమైపోయింది. కాని దాని చిహ్నాలుకొన్ని యింకా మిగిలే ఉన్నాయి. ఆషాఢ పౌర్ణమినాడు ఆ దేవళంలోకిపోయి భక్తి పూర్వకంగా మేఘమల్లార్ రాగాన్ని ఆలాపన చేస్తే సరస్వతీదేవి ప్రత్యక్షమై వరములు యిచ్చేది. ప్రస్తుతంలో యీ విషయం దేశంలో ఎవ్వరికీ తెలియదు. ఆషాఢం, శ్రావణ పౌర్ణమికే యీ కార్యానికి తగినరోజులు. నియమిత సమయంలో పరిశుద్ధమైన మనస్సుతో చేసిన తరువాత గాయకుడికి సిద్ధిలాభం కలుగుతుంది. సంగీతశాస్త్రంలో ఇక అతనికి తెలియని విషయం అంటూ ఉండదు. కాని ఆ ప్రార్థన చేసేవ్యక్తి అవివాహితుడై ఉండాలి...అందుకనే వచ్చే పౌర్ణమినాడు మనం యిద్దరం ఆ దేవి సన్నిధానంలో ప్రయత్నించుదాం. ఏమంటావ్?"

సూరదాసు మాటవిని ఆశ్చర్యపోయాడు. ప్రద్యుమ్న తనవల్ల యీ కార్యం ఏ విధంగా జరుగుతుంది? ఆచార్య వసువ్రతులవారు కళమీద ఉపన్యసిస్తూ ఎన్నోసార్లు చెప్పారు. "కళాధిదేవత సరస్వతీదేవిని గురించి హిందువులు ఊహించింది. కల్పనా మాత్రమే అందులో వాస్తవికత లేదు. ప్రత్యక్షంగా సరస్వతీదేవిని చూడటం సామాన్యమైన విషయమా?"

ఈ విధంగా ఆలోచిస్తూ చాలా సేపటి వరకు మౌనంగా ఉండిపోయాడు.

సూరదాసు కొద్దిగా విచారపడి అన్నాడు. "నీకు యిది యిష్టంలేదా?"

ఆది కాదు. ఇదెలా సంభవమా...అని ఆలోచిస్తున్నా" అన్నాడు- ప్రద్యుమ్నుడు.

"దాని విషయంలో నువ్వు నిశ్చింతగా ఉండు. నిజం దానంతట అదే తెలుస్తుంది. నువ్వు సరేననేట్లయితే...వచ్చే పౌర్ణమినాటికే పూజకు సిద్ధంచేస్తా"

ప్రద్యుమ్నుడి మనస్సు ఆలోచనలోపడింది. ఆఖరికి ఎలాగయితేనేం అన్నాడు—"సరే సిద్ధం చేయండి...వస్తాను."

"నాకు చాలా సంతోషంగాఉంది. మధ్యమధ్య అప్పుడప్పుడూ వస్తూ ఉండు. పూజకు సిద్ధం కావటంతో నువ్వుకూడా కొన్ని పనులు చేయాలి. అవేవో తర్వాత నే చెప్తాను" అన్నాడు- సూరదాసు.

మళ్ళీ యింకోసారి తన అంగీకారాన్ని తెలియపరుస్తూ ప్రద్యుమ్నుడు శెలవు తీసుకున్నాడు.

ఆలోచిస్తూ విహారపుబాట వెంబడినే పోతున్నాడు—"ఉస్ దేవి సరస్వతీ స్వయంగా తెల్లటి పద్మంలాంటి సుందరమైన శరీరచ్ఛాయ అలౌకిక ప్రతిభాన్వితమయిన ముఖప్రకాశం—కాని ఆచార్య వసుప్రతులవారు చెప్పేది...

* * *

ఆషాఢ పౌర్ణమినాటి, రాత్రిపూట ప్రద్యుమ్నుడు నది ఒడ్డునకు సూరదానువెంట వెళ్ళాడు. వాళ్ళు అక్కడికి చేరుకునే సరికి...ఆకాశం అంతా మేఘాలతో కప్పబడి ఉంది...ఆ అంధకారం మెరపుల కాంతి వల్ల జిగేల్ మంటోంది.

సూరదాను చెప్పిన ప్రకారం...ప్రద్యుమ్నుడు నదిలో స్నానంచేసి బట్టలు మార్చుకున్నాడు. ఆ పూజా ప్రయత్నాలు అవీచూస్తే తాంత్రికుడి పూజా సంరంభాలుగా ప్రద్యుమ్నుడికి తోచింది. వాళ్ళ విహారంలో యోగాచార్య పద్మసంభవులవారికి ఒక భిక్షుక శిష్యుడు ఉన్నాడు. తాంత్రికులను గురించి ఎన్నో విషయాలు వాడు చెప్పగా విన్నాడు. సూరదాను తన వెంబడి ఎన్నోరక్తం పూసిన మాలలు తీసుకువచ్చాడు. తను కొన్ని మెడలో వేసుకొని మిగతావి ప్రద్యుమ్నుడికి యిచ్చాడు. తన జుట్టును విరియబోసుకుంటూ ఆ దేవళంలో దీపాన్ని వెలిగించాడు. పూజకు కావలసిన అన్నివస్తువులూ, సమకూర్చటంలో ప్రద్యుమ్నుడికి వగర్పువచ్చింది. ఈ ప్రయత్నం యొక్క అంతిమ ఫలితం ఏంజరుగుతుందో చూడాలని ప్రద్యుమ్నుడికి చాలా తొందరగాఉంది. నిశ్శబ్ద నిశీథంలో ఒక తాంత్రికుడితో ఉండటంవల్ల సామాన్య మానవుడికి కలిగే భయం ఈ ఉత్సాహంతో ప్రద్యుమ్నుడు మరచిపోయాడు. ఎంతోసేపు గడిచిన తర్వాత పూజార్చనలు సమాప్తం అయాయి.

"నాపని పూర్తయింది. ప్రద్యుమ్నా ఇక నీపని ప్రారంభించు. కాని జాగ్రత్త. నీకార్య నిర్వహణంమీదనే అంతిమ ఫలితం ఆధారపడి ఉంటుంది" అన్నాడు సూరదాను.

క్షుధాపూరమయిన చిత్రం సూరదాను కళ్ళల్లో ప్రతి ఫలించుతోంది. కాని అది ఎందుచేతనో ప్రద్యుమ్నుడికి మంచిదిగా తోచలేదు. ఐనప్పటికీ పూర్ణ శక్తితో మేఘమల్లార్ ఆలాపన చెయ్యటం ప్రారంభించాడు.

ఆ సమయంలో, గాలి ఏమీలేదు. నాలుగువైపులా నిస్తబ్దత అధికారాన్ని చెలాయిస్తోంది. ఎగిరే పక్షులు కూడా, ఆ చీకటిలో కనుపించవు. అప్పుడప్పుడు గాలి తరంగాలవల్ల మైదానం ఆవలివైపున సాలవనంలో ఝూయ్ మనే శబ్దం వ్యాపించుతోంది. ప్రకృతి అంతా నిద్రపోతోంది. కాని ఆ భద్రావతినది మాత్రం ఒక్కతే మేల్కొని...ఏదో ఒక అనంతంతో తను కలుసుకోవాలనే నిర్ణయంతో గబగబ పరుగెత్తుకు పోతోంది_ మందస్వరంతో తియ్యగా ఆనంద గీతాలను పాడుతూ మధురమయిన చిన్నచిన్న దెబ్బల్ని రెండువైపులా గట్టులకు అందిస్తూను...అకస్మాత్తుగా గుడియందు చీకటిఅంతా మాయమయిపోయింది. ప్రద్యుమ్నుడు చూసాడు. పౌర్ణమినాటి ప్రకాశంతో సమానమయిన అపురూప సుందరి నిలబడి ఉంది. నల్లటి తలవెంట్రుకలు పిరుదుల వరకు నాలుగు వైపులా వ్యాపించి వున్నాయ్. స్వర్గీయ శిల్పి నిర్మాణంతో సమానంగా_ ఆ రెండు పెద్దకళ్ళు మంచులా తెల్లగా రెండు భుజాలూ వడ్డాణం మధ్య దాక్కున్నట్టుగా వుంది. ఎర్రటి కమలాలులాగా ఆమెపాదాలు వున్నాయ్. దానివల్లనే భూమిమీద వసంతపు సౌందర్యం వెల్లివిరుస్తున్నట్టుంది. ప్రద్యుమ్న ఆలోచించటం ప్రారంభించాడు___"ఆ...ఈమే ఆదేవి. వీణా ఝంకారం వల్ల ప్రపంచంలో శిల్పుల సౌందర్యతృష్ణ మంగళయుక్తం అవుతుంది. యీ తల్లి వీణ వల్లనే ఆశీర్వాదంవల్ల సత్యం సృష్టించబడుతోంది. యీ మెనుహీను శాశ్వతం దానం అక్షయం. నవ్యనూతనం యీతల్లి వాక్కు."

చూస్తుండగానే దేవి ఆకారం అంతర్ధానమయిపోయింది. వెలుగు తగ్గిపోయింది. గాలి నిస్తేజభావంతో ప్రవహిస్తోంది.

చాలా సేపటివరకు ప్రద్యుమ్నుడు మాయలో మునిగిపోయాడు. చూసినదేదో...స్వప్నమా...నిజమా???...చివరికి సూరదాసు పిలుపువల్ల అతనికి స్పృహవచ్చింది. ఆయన అన్నాడు..."నాపని యింకా పూర్తికాలేదు...నువ్వు వెళ్ళాలనుకుంటే వెళ్ళు. నామాటలోని నిజం బాగా తెలిసిందిగా..."

సూరదాసు చెప్పింది ఎంతటి నిజమో ప్రద్యుమ్నుడు స్వయంగా చూశాడు. ఆ తాంత్రికుని కళ్ళు అంధకారంలో...ప్రకాశిస్తున్నయ్...

సూర్యదాసు దగ్గర సెలవు తీసుకుని విహారానికి బయలుదేరేటప్పటికి చంద్రుడ్ని మేఘాలు ఆవరించి వున్నాయ్. అప్పుడప్పుడు మెరుపులు మెరుస్తూనే వున్నాయ్. కాని వాటికాంతి చాలా తక్కువగా వుంది. గ్రహణం అప్పుడు ఎన్నోసార్లు చూశాడు. సరిగ్గా అలాగే ఉంది.

ఆలయపు ఆవరణ చాలా పెద్దది. దాన్ని దాటటానికే చాలా సమయం పట్టింది. ఆ తర్వాత దట్టమైన అడవి సాల... దేవదారు వృక్షాల కొమ్మలు ఒకదానినొకటి కౌగలించుకుని... వ్యాపించిపోయాయి. సగం దారిలోనే తెల్లవారి పోతుందేమోనని తొందరగా నడవటం ప్రారంభించాడు. అడవిలో ఒక వైపునుంచి కొద్ది వెలుగు వస్తోంది. చూసాడు ప్రద్యుమ్న_సూర్యోదయపు కాంతి చెట్లచాటునుంచి అలా కనపడుతోందనుకున్నాడు. కాని ఆ విధంగా లేదు. ఆ వైపుగా అడవిలో ప్రవేశించాడు. వెలుతురు వస్తున్న ఆ రావి చెట్టుక్రింద తను ఆలయంలో చూసిన సుందరి నిలబడివుంది. నోటమాటరాలేదు. ఆశ్చర్యంతో ఆలోచించటం ప్రారంభించాడు___దేవాలయంలో చూసిన సుందరి యీ చీకటిలో అరణ్యంలో ఎందుకు తిరుగుతోంది? మిణుగురుపురుగు దేహంనుంచి వచ్చే కాంతిలాంటిది... ఆమె శరీరంనుంచి కూడా వస్తోంది. ప్రద్యుమ్న దగ్గరకి వెళ్ళిచూశాడు___ఆవిడ కళ్ళు ఎఱ్ఱబడి ఉన్నాయ్... రాత్రంతా నిద్ర లేనప్పుడున్నట్టుగా... అరణ్యంలోనుంచి బయటకు పోయేందుకు దారి వెతుకుతోంది. కాని దారి తెలుసుకోలేక చీకటిలో చెట్లకింద తారట్లాడవలసి వచ్చింది. అందుకనే ఆవిడ చాలా విచారంతో వున్నట్టుగా కనిపించింది.

ప్రద్యుమ్నుడికి భయం పుట్టుకవచ్చింది. సరస్వతీదేవి ప్రసన్నురాలయి నప్పటినుంచి జరిగిన సంఘటనల్ని... ఒక్కొక్కటిగా జ్ఞాపకం చేసుకోవడం ప్రారంభించాడు. దాంతో యిక మనశ్శాంతి లేకుండా పోయింది.

అక్కడ యిక ఆట్టేసేపు కూర్చోలేకపోయాడు. తొందరగా పరుగెత్తుకువచ్చి విహారం చేరుకునేటప్పటికి... చంద్రుడు క్షీణ కాంతితో అస్తాద్రి చేరుకుంటున్నాడు.

తెల్లవారుజామున పక్కమీద పడుకుని స్వప్నం చూశాడు... భద్రావతీ నదీ తీరాన ఒకదేవి తనవారిని మరచిపోయి దాన్ని కనుక్కోలేక ఎంతో బాధ పడుతుంది. అంతటి ఆవేదనను భద్రావతీ నదీప్రవాహం కూడా కలగ జేస్తోంది. ఆ ప్రవాహము పొంగువల్ల శరీర కాంతికూడా తగ్గిపోయి మాయ

నవుతుంది. చీకటిలో తిరగటం, కోమలమయిన పద్మంలాటి ఆమె పాదాలను నదిలోని చేపలు తమ దెబ్బలతో గాయపరుస్తున్నాయ్. అసహాయత్వం వల్ల దుఃఖిస్తోంది. ఇంతలో పెద్ద చేప ఒకటి తన భయంకర దంతాల్ని చూపిస్తూ అట్టహాసం చేస్తుంది. సరిగ్గా అది సూరదాసు నవ్వులాగానే ఉంది.

*    *    *

నిద్రలేవటంతోటే ఆచార్య పూర్ణవర్ధనుల వారిదగ్గరకు వెళ్ళి గతరాత్రి అంతా సూరదాసును మొదట కలుసుకున్నప్పటినుంచీ జరిగిన అన్ని విషయాలూ విపులంగా చెప్పాడు ప్రద్యుమ్నుడు. ఆచార్యులవారు బౌద్ధదర్శన శాస్త్ర అధ్యాపకులు. విహారంలోని భిక్షువులందరికంటె ఆయన వృద్ధుడు. అందుకనే ఆశ్రమంలో అందరికీ ఆయన అంటే అంత గౌరవం. ప్రద్యుమ్నుడి మాటలు విని ఆశ్చర్యపోయాడు. దుఃఖించాడు—"ముందే యీ విషయాలన్నీ నాతో ఎందుకని చెప్పలేదు—" అన్నారు ఆచార్యులవారు.

"ఆయన చెప్పవద్దన్నారు...అది కాకుండా ప్రతిజ్ఞ."

"తెలిసింది.. ఐతే యిప్పుడు చెప్పటానికి ఎందుకొచ్చావ్?"

"ఈ విధంగా చెయ్యటంవల్ల...ఒకరి హృదయానికి కష్టం కలిగించి నట్టుగా యిప్పటికి నాకు తోచింది."

ఆచార్యులవారు క్షణంపాటు నిశ్శబ్దంగా ఊరుకున్నారు. "ఇటువంటి సంఘటన ఒకటి త్వరలోనే జరుగుతుందని నాకు తెలుసు. పద్మసంభవుడు అతని శిష్యులు దేశంలోని మతాన్ని నాశనం చెయ్యాలని ప్రయత్నం చేసున్నారు. వారి బుద్ధి ననుసరించి ఏపని చెయ్యటానికయినా జంకరు ప్రద్యుమ్నా! నీకౌతూహలం ఆశాద్యతలోనే నీ సర్వనాశనం ఉన్నట్టుగా కనిపిస్తోంది. ఆ రాత్రి చాలా పాపపుపని చేసావ్. సరస్వతీదేవిని ఖయిదు చెయ్యటంలో నీ శక్తి వినియోగింపబడింది."

ఆశ్చర్య పడవలసిన సమయం—ప్రద్యుమ్నుడి నోటివెంట మాట రానేలేదు. ఆచార్యులవారు చెప్పటం ప్రారంభించారు. "ఇటువంటి కార్యాలు చేయకుండా తప్పించడానికోసమే... ఏశిష్యుణ్ణీ నేను విహారందాటి పైకి పోనియ్యకపోవటం. ఐనా నువ్వు అమాయక బాలుడివి. ఇందులో నీతప్పుకూడా స్వల్పంగానే ఉంది. సరే సూరదాసు ఆకారం ఎల్లా ఉంటుందో చెప్పు."

ప్రద్యుమ్నుడు సూరదాసు ఎల్లా ఉండేది విపులంగా వర్ణించి చెప్పాడు.

పూర్ణవరసులవారు అన్నారు—నాకు తెలుసు . . . నువ్వు అనుకున్న సూరదాసు అసలు సూరదాస్ కాదు. అతనిదేశం అవంతీ కూడా కాదు — వాడు ప్రసిద్ధ కాపాలికుడు, గుణాఢ్యుడు. తన ప్రయోజనంకోసం నీకు మారు పేరు చెప్పాడు.”

ప్రద్యుమ్నుడు కుతూహలంతో—“మీరు యిప్పుడు చెప్పింది . . .” అన్నాడు.

“ఆకథకూడా చెపుతాను...నదీతీరాన సరస్వతీదేవి గుడి శిథిలాలు ఉన్న చోటు పూర్వ కాలంలో హిందువులకు ప్రసిద్ధ తీర్థభూమి. ఇప్పటికి, రెండు వందల సంవత్సరాలక్రితం ఆ దేవాలయం మంచి ఉన్నతస్థితిలో ఉండేది. దానిలోనే యువక గాయకుడు ఒకడు నివసిస్తూ ఉండేవాడు. సామాన్యంగా ప్రచారంలో ఉన్న విషయం యిది... ఆ గాయకుడు మేఘమల్లార్ రాగం పాడటంలో ప్రవీణుడు...అతను ఆరాగం ఆలాపన చేసినప్పుడల్లా సాక్షాత్తు సరస్వతీదేవి ప్రత్యక్ష మయేదట. ఇదికూడా ఆదేవాలయం ప్రసిద్ధి చెందటానికి కారణం అయింది. ఆ సిద్ధ గాయకుడు చనిపోయినా కూడా పూర్ణిమ నాటి రాత్రి మేఘమల్లార్ ఆలాపనచేస్తే దేవి ప్రత్యక్షమై వరం యిస్తుంది.

ఆ కాపాలికుడు—గుణాఢ్యుడు, ఒకసారి సూరదాసుతో కూడా ఆ గుడిలో ఉండటం తటస్థించింది. స్వతఃగా సూరదాసు గొప్ప గాయకుడు అతడు పాడటంతోనే దేవి ప్రత్యక్షమై ప్రపంచంలోని గాయకులందరిలో శ్రేష్ఠుడవు కమ్మని వరమిచ్చింది. దేవి తరువాత గుణాఢ్యుణ్ణి ఏం కావాలో కోరుకొమ్మంది . . .అరూపానికి ముగ్ధుడై దేవి ఎప్పుడూ తనదగ్గరనే ఉండాలని కోరుకున్నాడు గుణాఢ్యుడు.

సరస్వతీదేవి అంది. “నన్ను శాశ్వతంగా తనబంధంలో ఉంచుకోవటం సామాన్యమైన విషయం కాదు...దేనిలోనన్నా ప్రావీణ్యత వుండాలని” వాడి పేరు గుణాఢ్యుడయిన ఏ కళలోనువాడికి ప్రావీణ్యత లేదు. అందుచేత సరస్వతీ దేవిని పొందలేక పోయాడు. దేవి అంతర్ధానమయినా వాడిమోహం మితిమీరి పోయి మార్పుచెంది క్రోధం వహించాడు. మాయతో దేవినిబంధించాలనే ఉద్దేశ్యంతో తాంత్రిక గురువుకోసం వెతకటం ప్రారంభించి ఒక సన్యాసివద్ద మంత్రోపదేశం పొందటంకూడా నాకు తెలుసు. కాని ఆ సన్యాసికి యితని

దుర్బుద్ధి తెలియటంతోనే తనవద్దనుంచి తరిమివేసాడు. ఈ విషయం యిక్కడి వృద్ధులంతా ఎరుగుదురు. దీని తరువాత గుణాఢ్యుడ్ని గురించి నాకేమీ తెలియదు. సిగ్గువల్ల దేశం విడిచి ఎక్కడికన్నా పోయి ఉంటాడనుకున్నా... కాని నీమాటలవల్ల నిన్నటిరాత్రి తన ఉద్దేశ్యాన్ని సఫలీకృతం చేసుకున్నాడని తెలుస్తోంది. ఇంకా ఆలయంలో ఉన్నాడో లేదో...వెళ్ళి చూసివచ్చి నాకు చెప్పు.”

ఒక్క క్షణంకూడా ప్రద్యుమ్నుడు యిక అక్కడ నిలబడలేక పోయాడు. విహారం ఉద్యానవనంలో పడి పరుగెత్తటం ప్రారంభించాడు. అప్పటికి ఎండ బాగానే వచ్చింది. విద్యార్థుల స్తోత్రపాఠం వినిపిస్తోంది.

ఏ ధమ్మ హేతు పభవా
తేసమ్ హేతుమ్ తథాగతాః
తేసచ్ ఏ నిరోధో
ఎవం వదీ మహాసమనో ||

పరుగెత్తుతూ చూశాడు ఉద్యానవనంలో ఒకప్రక్క జమ్మిచెట్టు నీడన... చిత్రకారులు వసుప్రతులవారు కూర్చుని ఉన్నారు. ఆయన మొహం మీద అసంతృప్తి చిహ్నాలు తాండవిస్తున్నాయ్...

ప్రద్యుమ్నుడు అనుకున్నట్టే అయింది. దేవాలయంలో ఎవరూ లేరు. గుణాఢ్యుడిమాట అటుంచి...ఆ సన్యాసికూడా మాయమైపోయాడు. విప్ప పానీయపు రెండు కుండలు మంటచెయ్యటానికని ఉన్న కట్టెలు ఆలయంలో చిందరవందరగా పడివున్నాయ్.

*　　　*　　　*

ఆ రాత్రిపూట ఎవ్వరితోను ఏమీ చెప్పకుండా ప్రద్యుమ్నుడు విహారాన్ని వదిలివేసి వెళ్ళిపోయాడు—

ఒక సంవత్సరం గడిచిపోయింది. విహారం వదలిన తర్వాత ఒక్కసారి మాత్రం ప్రద్యుమ్నుడు సునందను కలుసుకున్నాడు—'అవసరపు పనిమీద విదేశానికి వెడుతున్నా...త్వరలోనే తిరిగివస్తా' అని చెప్పాడు. ఆ ఒక్క సంవత్సరంలోనూ కాంచీ, ఉత్తర కోసల, మగధ రాష్ట్రాలన్నీ గాలించాడు. కాని గుణాఢ్యుడి జాడ తెలియనే లేదు.

ఈ ఉద్దేశంతో తిరుగుతూ అనేక వింత విషయాలను విన్నాడు. రాజాజ్ఞ ననుసరించి, ప్రసిద్ధశిల్పి మహేంద్రగుప్తుడు భగవాన్ బుద్ధుని విగ్రహం తయారుచేయటంలో నిమగ్నుడయ్యాడు. పూర్తిగా ఒక సంవత్సరం కష్టపడి విగ్రహాన్ని తయారుచేశాడు. కాని దానిముఖం ఎంతో అసహ్యంగా ఉంది. ప్రజలు దాన్ని అసలు బుద్ధవిగ్రహంగా గుర్తించనే లేకపోయారు. మగధలోని దుర్మార్గపు దస్యుడి మొగంలాగా ఉంది.

తక్షశిలలోని 'విఖ్యాత దర్శనిక పండితులు యమునాచార్యులవారు మీమాంస దర్శనికకు వ్యాఖ్యానం వ్రాయటంలో నిమగ్నులైపోయారు. కాని అకస్మాత్తుగా ఆయన జ్ఞానం మందగించి పోయింది. సూత్రాలకు అర్థం వ్రాయటానికి బదులు పాణిని సుబంత ప్రకరణం అధ్యయనం చెయ్యవలసి వచ్చింది.

మహాకోటి విహారంలోని చిత్ర విద్యావిశారదులు భిక్షుక వసువ్రతుల వారు "బుద్ధుడు సుజాత" చిత్రాన్ని ఎంతగా కష్టపడినప్పటికీ కూడ మనస్సుకు తృప్తి కలిగినట్టుగా తన ఉద్దేశ్యానుసారం చిత్రించలేక పోయారు. అందుకని విరక్తిచెంది యీనాడు పక్షివిజ్ఞానం దాని చర్చగురించి శ్రద్ధ తీసుకోవటం మొదలు పెట్టారు.

ఊరువిల్వ గ్రామంలో ఒక పశువైద్యుడు ఉన్నాడని ప్రద్యుమ్నుడికి తెలిసింది. అతని రూప ఆకారాలను గురించి విన్న విషయాలను బట్టి సూర దాసు అయి ఉంటాడని తెలిసింది. ఆఊరు వెళ్ళి ప్రద్యుమ్నుడు వాకబు చేశాడు. ఐనా ఎవ్వరూ కూడ వైద్యుడి జాడ చెప్పలేకపోయారు.

సరిగ్గా ఆసమయంలోనే అలసిపోయి ఊరి వెలుపల ఒక చెట్టుక్రింద కూర్చున్నాడు. ఇంకా సాయంకాలం కాలేదు. నెమ్మది నెమ్మదిగా, గాలి వీస్తోంది. ఎదురుగ్గా పొలాలలోని ధాన్యపుచెట్లు బంగారంలాగా మెరుస్తున్నాయ్. కొద్దిదూరంలోనే పువ్వులతో నిండి ఉన్న జలాశయం ఒకటి ఉంది. అందులో అడవి హంసలు విహరిస్తున్నాయ్.

కొద్దిదూరంలో చిన్న పర్వతం. దానినంటి ప్రవహిస్తూన్న సెలఏరు. పర్వతంక్రింద ఒకపెద్ద మడుగులోకి సెలఏరు ప్రవహించి పెద్ద కొలనుగా తయారయింది—ప్రద్యుమ్నుడు చూసాడు— ఒక స్త్రీ కడవపుచ్చుకుని పర్వతం దిగివస్తోంది.

అనుమానంతో కొంచెం ముందుకు నడిచాడు. మనస్సులో యిక అనుమానం తీరిపోయింది. అనేక భావాలతో హృదయం కల్లోలంగా వుంది. సూరదాసును వెదుకుతూ విహారంనుంచి బయలుదేరాడు. కనిపించితే ఏమి చేస్తాడో... ఏంచెయ్యాలో అతనికే తెలియదు__దేవిని చూసాడు. భద్రావతీ నదీతీరాన దారి మరచిపోయి అర్ధరాత్రివేళ తిరుగుతోంది. ఆరోజున చూసాడు, కాని యీనాడు ఆ శరీర కాంతిలో ఒక్క బిందువుకూడా లేదు. ధరించిన వస్త్రాలుకూడా మలినంగా వున్నాయ్. కాని ఆ సుందర ముఖం. అదే అందమైన కంఠం__

నిలుచునే దేవిని దీక్షగా చూసాడు. ఇక సందేహంలేదు.

ప్రతిరోజూ సాయంకాలం ఆచెట్టుక్రిందకే వచ్చి కూర్చుంటాడు. సాయంకాలం దేవి పర్వతం దిగివచ్చి నీరు తీసుకుని వెళ్ళిపోతూంటుంది__

* * *

ఈవిధంగా కొన్నిరోజులు గడిచి పోయాయ్. ప్రద్యుమ్నుడు మైదానంలో చెట్టునీడను నిశ్శబ్దంగా కూర్చునివున్నాడు. దేవి నీటికోసం జలాశయానికి వచ్చింది. కొంచెంసేపు ఆలోచించి ప్రద్యుమ్నుడు జలాశయానికి ఒకవైపున నిలుచున్నాడు. చూసాడు దేవి కడవతో నీరు నింపి గట్టున పెట్టి పువ్వులు కోసుకుంటోంది. ఒక ప్రక్కగానే మంచి అందమైన పువ్వు వికసించి ఉంది. అది చేతికి అందటంలేదు. కోయాలని ప్రయత్నం. రెండవవైపున ప్రద్యుమ్నుడిని చూసి అడిగింది__ నాకు ఆ పువ్వు కోసి యిస్తారా?

"ఆ....మీరు ఒకసహాయం చేస్తే?"

"ఏమిటి? చెప్పు"

"తింటానికి ఏమైనా యిస్తారా."

దేవి మొగంలో దుఃఖపుచిహ్నాలు గోచరించాయి. "ఆసంగతి ముందే ఎందుకుచెప్పలేదు. యిటువైపురా...పువ్వుపదిలెయ్యి" అంది.

ప్రద్యుమ్నుడు నీటిలోదిగి పువ్వుకోసి దేవిదగ్గరకు వచ్చాడు.

దేవి అడిగింది__"రోజూ మైదానంలో యీచెట్టుక్రింద నువ్వు కూర్చుంటావ్ కాదూ."

దేవికి పువ్వుయిస్తూ ప్రద్యుమ్నుడు అన్నాడు_ "తమరుకూడా యిక్కడికే నీటికి వస్తూంటారా..."

మ్లానయుక్తంగా నవ్వి దేవి అంది "ఈపర్వతంమీదనే నాయిల్లుఉంది నావెంటరా...ఏదైనా తినటానికి యిస్తాను"

అకస్మాత్తుగా నాలుగువైపులా...దేవి ఆతురతతోచూసింది. పర్వతం మీదికి ఏర్పాటుచేసిన మెట్లు ఎక్కుతూ పైకినడవటం ప్రారంభించింది. ప్రద్యుమ్నుడుకూడా ఆమెవెనకనే బయలుదేరాడు. పర్వతంమీదికి వెళ్ళిచూశాడు. వెదురుపొదలచాటున చిన్నకుటీరంఉంది. తడికతెరచి దేవిలోపలికివెళ్ళి లోపలికి రమ్మని ప్రద్యుమ్నుడికి సౌంజ్ఞచేసింది.

కుటీరంలో ఎవ్వరూలేరు. అడిగాడు "తమరు ఒంటరిగానే ఉంటున్నారా..."

"లేదు యిక్కడికి నన్ను ఒకసన్యాసి తీసుకువచ్చాడు. వాడు ఏం చేస్తుంటాడో నాకు తెలియదు. అప్పుడప్పుడు యిక్కడికి వస్తుంటాడు.

ప్రద్యుమ్నుడికి విప్పపానీయం...యిచ్చింది. అమృతంలాగా ఉంది. పానీయం ఇటువంటిది ఎప్పుడూ ప్రద్యుమ్నుడు త్రాగనేలేదు...

ప్రద్యుమ్నుడు ఆలోచించాడు___ఆచార్య పూర్ణవర్ధనులవారు చెప్పింది, నేనుచూసిందినిజమే అయినట్లయితే తప్పకుండా యీమె సరస్వతీదేవి అని అనుకోవాలి. తననుగురించి ఏంచెప్తుతుందో వింటామని కుతూహలం కలిగింది. అడిగాడు "ఇంతకుముందు తమరు ఎక్కడఉండేవారు? మీ నివాసంఎక్కడ?"

అప్పుడు దేవి పెద్దకొయ్యపాత్రలో భోజనంవడ్డించుకుంటోంది. ఆమాటలు వినటంతోటే ఆశ్చర్యంగా ప్రద్యుమ్నుడి వైపుచూసి అంది___"నావిషయం అడుగుతున్నావా? యిల్లుఎక్కడో నాకు తెలియదు...విదిశ మార్గంలో ఒక జీర్ణదేవాలయంలో ఉండేదాన్ని. అక్కడినుంచే యీసన్యాసి నన్ను తీసుకుని వచ్చాడు. అప్పటినుంచి ఇక్కడేఉన్నా. అంతకుముందు ఎక్కడ ఉండేదాన్నో నాకే తెలియదు...

పరాకుగా సూర్యుడు తనఅంతిమ కిరణాలను ప్రసరింపచేస్తూ అడవి వైపు క్రుంగిపోతున్నాడు. ఊరువిల్వ గ్రామంవైపుచూడటం ప్రారంభించింది. ఏదోఒకవిషయాన్ని జ్ఞాపకంచేసుకోవాలని ప్రయత్నించినప్పటికీ జ్ఞాపకం రాలేదు...కన్నీరుపెట్టుకుంది...మళ్ళీ కళ్ళుతుడుచుకుని అన్నపుగిన్నె ప్రద్యుమ్నుడి ముందుపెట్టుతూ అంది___తినదగ్గపదార్థాలు ఏవిలేవు. యీరాత్రియిక్క-

డనే ఉండిపో...కలువపువ్వు రేకుల పాయసం వండిపెడతాను...తెల్లవారిం తర్వాత వెళ్ళిపోదువుగాని..."

భోజనం పూర్తిఅయింతర్వాత ప్రద్యుమ్నుడు వెళ్ళడానికి అనుజ్ఞ అడిగాడు. దేవికళ్ళలో నిరాశవ్యాపించింది—అంది "రాత్రికి యిక్కడ ఎందుకు ఆగిపోకూడదు? పాయసంవండి పెడతానుగా..."

"రాత్రిపూట ఒంటరిగా ఉండటం మీకుభయంకాదూ?" అడిగాడు ప్రద్యుమ్న.

"బాగా భయంవేస్తుంది. ఆవనంలోని చీకటినిచూసి భయంవల్ల తలుపు కూడా తియ్యను. నిద్రకూడా రాదు...రాత్రంతా మేల్కొనేఉంటాను."

వస్తూన్న నవ్వును ప్రద్యుమ్నుడు అపుకున్నాడు. ఆలోచించాడు. దేవి పాయసం ఆశచూపించి రాత్రికి నన్ను అపుచేయాలనుకుంటోంది. దేవితో అన్నాడు "అలాగే ఉంటా."

దేవి మొగం సంతోషంతో కలకలలాడింది. రాత్రంతా ప్రద్యుమ్నుడితో ఆరుబయట గడిపింది. సంతోషంతో "చక్కటి వెన్నెల—భయంవల్ల యివతలికి వచ్చేదాన్ని కాదు...రాత్రంతా యింటిలోకూర్చునీ ఒంటరిగా గడుపవలసి వచ్చేది" అంది.

ఆమె మాటలువిని ప్రద్యుమ్నుడు ఆశ్చర్యపోయాడు. ఎంతటి మంత్రశక్తి అయినా ఆత్మవిస్మృతి గలుగుతుందని కలలోకూడా అనుకోలేదు. ఆ మాటలు యీమాటలు చెప్పి తెల్లవారింతర్వాత దేవిని శలవుయిమ్మనిఅడిగాడు.

"సన్యాసి వచ్చినతర్వాత ఒకసారిరా" అంది దేవి.

ఆరాత్రి మొదలుకొని ప్రతిరాత్రి దేవికి కనపడకుండా కుటీరాన్ని కాపలా కాస్తూండేవాడు. అతని యువకహృదయం అబలయైన స్త్రీని ఒంటరిగా వదలి వెళ్ళలేకపోయింది.

పదిపదిహేనురోజులు గడిచిపోయాయి.

దేవి ఒంటరిగా పాడటం ప్రద్యుమ్నుడు ప్రతిరోజూ వినేవాడు. ఆ పాటలో జీవుల్ని మోహింపజేసే లాలిత్యం—ప్రధమస్వర మాధుర్యం... ఉన్నాయ్...

ఒక రోజు రెండు జాములప్పుడు ... ఎవరో అతనితో చెప్పారు—" "నువ్వు వెదుకుతున్న పశువైద్యుడు కనిపించాడు, ఇక్కడికి కొద్దిదూరంలో

శాలు ప్రక్కనేఉన్న చెరువులో స్నానం చేస్తున్నాడు—"

మాట వినటంతోటే పరుగున చెరువుదగ్గరికి వెళ్ళిచూసాడు—నిజంగా గుణాఢ్యుడు తన సామాను గట్టున పెట్టిస్నానం చేస్తున్నాడు...అతను వచ్చేటంతవరకు అక్కడనే కూర్చున్నాడు.

బట్టలు మార్చుకుని పైకివచ్చి ప్రద్యుమ్నుణ్ణి చూసి ఆశ్చర్యపోయి అన్నాడు—"ఇక్కడికి ఎలావచ్చావ్?"

"ఎలావచ్చావ్...మీకు యింకా తెలియనేలేదా?" జవాబు యిచ్చాడు ప్రద్యుమ్నుడు...

"ప్రద్యుమ్నా... నన్ను యింకా అవమానపరచబోకు... ఆపని చేసినందుకు చాలా దుఃఖిస్తున్నా...నిద్రలో భయంకర స్వప్నాలువచ్చి—నువ్వుచేసినపని మంచిదికాదు... దానికి శిక్ష అనంత నరకం—అని ఎవరో చెప్పుతుంటారు.

కొండగోగుల క్రిందటనే నాగురువు... ఆజన్మాంత సన్యాసిదగ్గరకు వెళ్లాను. వశీకరణ మంత్రం ఆయన ద్వారానే నాకు లభించింది... దానివల్ల కావలసిన మనిషిని బద్ధుణ్ని చెయ్యగలను. కాని... ఆకర్షింపబడేట్టు చెయ్యలేను. అందుకనే నీ సహాయం కోరుకున్నా... నాకు అసలు సంగీతం రాకకాదు... మేఘమల్లార్ రాగం ఆలాపన చెయ్యడంలో నాకన్నా ప్రావీణ్యతఉందని... నీ రాగంవల్ల దేవి తప్పకుండా ప్రత్యక్షమవుతుంది...అప్పుడు బంధించవచ్చునని ఆలోచించా. ఇంతకుముందు యీ మంత్రంవల్ల—ఆత్మవిస్మృతి కలుగుతుందని (మంత్రించబడ్డ వ్యక్తికి) నాకు తెలియదు నిజం చెప్పాలంటే మంత్రశక్తిని పరీక్షించుదామనే యీ పనిచేసా—"

"ఐతే యిప్పుడు నీ అభిప్రాయం ఏమిటి?" అడిగాడు ప్రద్యుమ్న.

"ఇప్పుడే నా గురువు దగ్గరనుంచి వస్తున్నా—నా మాటలన్నీ విని ఆయన రెండవమంత్రం ఉపదేశించారు...పూర్వపు మంత్రాన్ని...నాశనంచేసే శక్తి దీనికి ఉంది. ఈమంత్రపు జలంగేవి పాదాలమీద చల్లేటట్టయితే...బంధం వదలిపోతుంది...కాని ఆనీరు చల్లేవానికి గొప్ప ఆపద కలుగుతుంది."

"ఎందుకని ఆపదకల్గుతుంది?" ప్రద్యుమ్నుడు అడిగాడు.

"నీరు చల్లేవాడు శిల అయిపోతాడు. అందుకనే ఆమెను బంధించి ఉంచటంలోనే నాకు సుఖంఉంది. కోపం తెచ్చుకోకు, కొంచెం ఆలోచించు.

చనిపోయింతర్వాత రెండవ ప్రపంచం వస్తుంది. కాని రాయి అయిపోతే..."

ఆసమయంలో ఆత్మ విస్మృతిని చెందిన దేవి రెండు కళ్ళూ ప్రద్యుమ్నుడికి జ్ఞాపకం వచ్చాయి. ఎవ్వరూ నీరు వల్లకపోతే శాశ్వతంగా ప్రపంచంలో విద్యలేకుండా పోతుంది. ఈ ఆలోచన అతన్ని దుఃఖపెట్టింది.

సామాన్యంగా యువకుల హృదయాల్లో ఉండే ఆవేశమే ప్రద్యుమ్నుని ప్రోత్సాహపరచింది. ఆలోచించాడు.

"మానవుడి జీవితం తుచ్ఛమైంది. ఆమె పద్మాలలాంటి పాదాలలో చిన్న ముల్లుగుచ్చుకున్నంత మాత్రాన అవసరం వచ్చేటట్లయితే నా జీవితాన్ని వందసార్లు త్యాగం చేస్తాను." గుణాఢ్యుడి వైపుతిరిగి అన్నాడు—

"నేనువస్తా నడవండి ఆ జలం నాకుయివ్వండి గాని"

గుణాఢ్యుడు ఆశ్చర్యంగా చూడటం ప్రారంభించాడు. "బాగా ఆలోచించు పిల్లల ఆట కాదు. యిది."

"ఆఁ నడవండి పోదాం"

కుటీరం దగ్గరకువచ్చి గుణాఢ్యుడు అన్నాడు "ప్రద్యుమ్నా యింకొక సారి ఆలోచించు, అసంభవపు ఆశపెట్టుకోకు దీని తర్వాత రక్షించేశక్తి దేవికి కూడాలేదు. మంత్రశక్తివల్ల నీ ప్రాణాలు నశించిపోతాయి. మంత్రశక్తి అమోఘం. ఆ తర్వాత తప్పించుకోవటానికి వీలులేదు."

ప్రద్యుమ్నుడు అన్నాడు—"మీరు ఆలోచించమనే విషయాన్ని నేను శ్రద్ధగా చూస్తున్నాననుకున్నారా?... ఇక ముందుకు నడవండి."

కుటీరం దగ్గరకు వచ్చేసరికి సాయంకాలం కావస్తోంది. దేవి కుటీరం బయటకు అన్యమనస్కురాలై గడ్డిమీద కూర్చునివుంది. ప్రద్యుమ్నుడు రావటంచూసి చాలాసంతోషించిఅంది "రా...రా...నిన్నుగురించే ఎప్పుడూ ఆలోచిస్తూ ఉంటా. ఆరోజున నీకు సరిగా భోజనం పెట్టలేకపోయాను. అందుకనే నా మనస్సుకు కష్టంగావుంది. ఇక్కడ కొన్నాళ్ళపాటు ఉండు—" ఇద్దరికీ వంట చేద్దామని కుటీరంలోపలికి వెళ్ళింది.

ప్రద్యుమ్నుడు అడిగాడు—"ఏదీ ఆ మంత్రజలం యిలా యివ్వండి."

"నిజంగా నువ్వుసిద్ధంగా ఉన్నావా?"

"ఇంకా ఎక్కువగా నేను చెప్పదల్చుకోలేదు. ఆ జలం యివ్వండి."

దేవి యిద్దరికి భోజనం తెచ్చిపెట్టింది. భోజనాలు అయ్యే సరికి చీకటి.

పడుతోంది. సూర్యుడి ఎర్రటి ఎండ ఊరువిల్వ గ్రామం మీద పడుతోంది. ఆ నీరెండలో దేవి ముఖం అత్యంత సుందరంగా ఉంది. మామూలుగా నీరు తేప టానికి కుండ తీసుకుని పర్వతం క్రిందకు వెళ్ళింది.

"ఇక నేను వెళతాను. దేవి వచ్చాక యీ మంత్రజలం ఆమె మీద చల్లు" అన్నాడు గుణాఢ్యుడు.

ఈ మాటలు చెపుతూ అతని కంఠం దుఃఖంతో పూడుకుపోయింది. మళ్ళీ ఆవేశంతో ప్రద్యుమ్నుడ్ని కౌగలించుకుని అన్నాడు— "నేను పిరికి వాడ్ని. నాకు అంతటి ధైర్యంలేదు."

కుటీరంలోనుంచి తన సామానుఅంతా తెచ్చుకుని తిరిగి ఒకసారి ప్రద్యు మ్నుడికి నమస్కారం చేసి పర్వతం రెండవ వైపునుంచి దిగి వెళ్ళిపోయాడు. ఆ వైపునే కొద్దిదూరంలో మగధ బారుగాను విదిశ పోయే మార్గం ఉంది.

కూర్చునే నాలుగువైపులా తనదృష్టి సారించి ప్రద్యుమ్నుడు ఆలో చించాడు. ఇరువది సంవత్సరాల క్రితం యీ ఆకాశం క్రిందనే జన్మించాను. కాని యీ రోజున అమ్మ కాశీలో యింట్లో కిటికీ దగ్గర కూర్చుని ప్రవాసియై పోయిన కొడుకుని జ్ఞాపకం చేసుకుంటూ ఉంటుంది. మళ్ళీ ఒకసారి తల్లిని చూడాలని ప్రాణం తహతహ లాడింది...

తూర్పువైపున నవమి చంద్రుడు...ఎంత అందంగా ఉన్నాడు.

ప్రద్యుమ్నుడికళ్ళు నీటితో నిండిపోయాయి. ఆ సమయానికి దేవి నీరు తీసుకుని వస్తోంది.

క్రింద ఉంచిన జలం దేవిని చూడటంతోనే చేతిలోకి తీసుకున్నాడు.

దేవి కుటీరం దగ్గరకు వచ్చింది. చేతిలో సగం వికసించిన కలువపువ్వు లున్నాయ్..."ఆ సన్యాసి ఎక్కడికి వెళ్ళాడు?"

"ఎక్కడికో వెళ్ళాడు. యివ్వాళ్టి కిరాడు..." జవాబిచ్చాడు ప్రద్యుమ్న.

దేవి దగ్గరకు వెళ్ళి పాదధూళి తీసుకుని నమస్కరించి అన్నాడు. "అమ్మా నీకు ఎంతటి అపకారం చేసానో నీకు తెలియదు...దానికి శిక్ష యీ రోజున తీసుకుంటున్నా; అందుకని నాకు ఏ మాత్రం విచారం లేదు. నాకు స్మృతి తప్పిపోయేవరకు విశ్వసౌందర్య లక్ష్మిని బంధవిముక్తురాలిని చేసే భాగ్యం లభించినందుకు సంతోషిస్తున్నా"

దేవి ఆశ్చర్యంగా చూడటం ప్రారంభించింది.

"ఇంతకుముందు ఎక్కడ ఉండేదానివో జ్ఞాపకం తెచ్చుకో అమ్మ"

"ఎందుకు? విదిశ మార్గంలో..."

సరిగ్గా అప్పుడే ప్రద్యుమ్నుడు దోసెడు నీళ్ళు దేవిసర్వాంగములమీద చల్లాడు. నిద్రనుంచి మేల్కొన్నట్లుగా కళ్ళు తెరవటం ప్రారంభించింది. మళ్లీ యింకొక దోసెడు నీళ్ళు చల్లాడు. అతనికళ్ళ ఎదుట అపూర్వ సౌందర్య ప్రకాశం వస్తూన్నట్టుగా అతనికి కనిపించింది. శరీరం అంతా సంతోషంతో ఊగిసలాడిపోయింది. వెంటనే కాశీలో మిద్దెమీద నిల్చున్న తల్లికూడా జ్ఞాపకం వచ్చింది.

*

విహారంలోని శిష్యగణంలో ఒక తక్కువ వయస్సు కన్య, ఆచార్య శీల ప్రభుల వారిదగ్గర దీక్షతీసుకుంది. సునంద హిరణ్యనగరంలోని భాగ్యవంతుడు, సామంతదాస్ కూతురు. తల్లిదండ్రీ ఎంతచెప్పినాకూడా పెళ్ళికిఅంగీకరించలా... తక్కువ వయస్సులోనే సన్యాసిని అవటంవల్ల ఆమె అంటే అందరికీగౌరవం. విహారంలో ఎవ్వరితోనూ ఎక్కువగా కలసి మెలసి తిరగదు. తనపనిఏదో చేసుకుంటుంది. తీరిక సమయాల్లో అన్యమనస్కురాలై ఏదో ఆలోచిస్తుంది.

వెన్నెల రాత్రిలో విహారంలోని ఉన్నత ప్రదేశంలో కూర్చుని దేనినో ఆలోచిసుంది. మైదానంలో ఎవరన్నా వెన్నెట్లో వస్తోంటే ఆ వైపే చూస్తుంది. తన ప్రియుడు వస్తున్నాడేమోనని నిరీక్షిస్తూ వ్యాకులపడుతుంది. సాయంకాలం కాకపోతే సాయంత్రం వస్తాడనుకుంటుంది. రోజులు నెలలు గడచి పోతున్నాయ్. కాని ఎవ్వరూ రాలేదు. వినా అకన్య అనుకుంటుంది. వస్తారు తప్పకుండా వస్తారు. ఆకులు చప్పుడైతే వచ్చాడేమోననుకుని చూస్తుంది.

ప్రతిరాత్రి అద్భుతమైన స్వప్నాలు చూస్తుంది. ఎక్కడో ఒక అరణ్యంలో పర్వత శిఖరంమీద వెదురు పొదలమధ్య అర్ధనగ్న శిలామూర్తి ఉంది. నిస్తబ్ధపు రాత్రిపూట వెదురు చెట్లకొమ్మలు గాలికి ఊగిసలాడుతూంటాయ్. పెద్దచప్పుడు పుట్టుకొస్తుంది. దాని ఆకులతో విగ్రహాపు మొగం కప్పబడి పోయింది. ఆ పొదనుంచి వచ్చేగాలిలో కేవలం మేఘమల్లార్ రాగమే విని పిస్తూంటుంది.

ఉలిక్కిపడి నిద్రలేచి అనుకుంటుంది. ఆ వెదురు వనం ఎక్కడుంది? పర్వతంపై ఆ శిలావిగ్రహం ఎక్కడ?...యీ నిరర్ధకపు స్వప్నాలన్నీ ఎందుకు?

... ? ... ?. ...

శరత్ బాబు

# బరువు

సాగర్‌పూర్‌లో, ప్రస్తుతం చాలా సందడిగావుంది. నగారా, నౌబత్‌ఖానాల మ్రోతలతో, పూరువూరంతా గింగుర్లెత్తిపోతోంది. ఊళ్లోవాళ్లు, చుట్టుపట్ల నాలుగుక్రోసుల దూరంలోని జనులుఅంతా యీవిషయాన్ని బాగా యెరుగుదురు. ఈ రాజసూయ యజ్ఞంలో, ఢోలువాయిద్యాల యేకక్రీసవతా వేశం, నౌబత్‌ఖానావాళ్ళ అదర్శ ఐక్యభావం, కంచుతప్పెటల విక్రమపరాక్రమం—ఇవన్నీ యింతకుముందు ఆ గ్రామస్థులెప్పుడూ చూసివుండలేదు. వివిధవాయిద్యాలవల్ల మనుష్యశ్రేణికి కల్గే అపరిమిత ఆనందంవల్ల, అవూరిపశువులకు చాలా యిబ్బందికల్గింది_ ముఖ్యంగా ఆవుమూడలకు, ఢోలువాద్యాల అత్మఘోషవల్ల వీటికి అంతర్గతబాధ మరీ యెక్కువైంది. ఇంత పెద్దకోలాహలం_ హడావిడికి కారణం_ ముక్కుపచ్చలారని పధ్నాలుగేళ్ళ కుర్రవాడి పెళ్ళి. సాగర్‌పూర్ జమీందారు శ్రీమాన్ మహాదేవ మిత్రగారి యేకైకపుత్రుని వివాహసందర్భంలో, యింత అట్టహాసం జరిగింది. మహాదేవ మిత్రగారిని భాగ్యవంతులలోనే లెక్కవేయవచ్చు. సాలీనా యేభై, అరవై వేల రూపాయల ఆదాయం వస్తుంది. కొడుకుపేరు సత్యేంద్రకుమారమిత్ర. హేయర్ దొరగారి స్కూలులో, యెంట్రెన్స్‌క్లాసు చదువుతున్నాడు. కుర్రవాడితల్లి తన ఒక్కగానొక్క కొడుక్కి పెళ్ళిఅయి, కోడలిముఖం తొందరగా చూడాలని పట్టుపట్టటంచేత, యింత చిన్నవయస్సులోనే పెళ్ళిచెయ్యవలసి వచ్చింది.

వర్ధమాన్‌జిల్లా, దిల్‌జాన్‌పూర్ జమీందారు శ్రీయుత కామాఖ్య చరణబాబుగారి కనిష్ఠపుత్రి సరళతో, సత్యేంద్రుని వివాహమైంది.

పిల్ల యెఱ్ఱగా అందంగా వుంటుంది. సత్యేంద్రుడు చాలా సంతోషపడ్డాడు.

పదేళ్ళ కుందనపుబొమ్మలాంటి కోడలు ముఖంచూసి సత్యేన్ తల్లికూడా చాలా సంతోషించింది. పెండ్లి అయిన రెండవరోజునే మహాదేవబాబు కోడల్ని యింటికి తీసుకువచ్చాడు. 'పిల్లను పుట్టింటిదగ్గర ఆట్టేకాలం వుంచకూడదన్న భార్య

సలహారేమో' దీనికి కారణమైంది. ఆమె తరుచు చెపుతూంటుంది_ 'పిల్లను పెళ్ళి అయింతర్వాత పుట్టింటిదగ్గర వుండకూడదు'. ఐతే ఆమె అభిప్రాయం తప్పు కాదని, అందరికీ తెలుసు.

సత్యేంద్రుని చదువుకోసం, ఆతనికి వీలుగావుంటుందని, హరదేవబాబు స్త్రీసమేతంగా, కలకత్తాలో కాపురంపెట్టాడు. సరళ కూడవచ్చింది. చిన్నవయస్సులో పెళ్ళిఅయింది. అందుకని సరళ భర్తమొహమటంకూడా మామగారితోమాట్లాడుతుంది. దీనివల్ల హరదేవబాబుకు ఆనందం తప్పితే, దుఃఖమేమీ కలగదు.

కొన్నిరోజుల తర్వాత, తండ్రివచ్చి సరళను పుట్టింటికి తీసుకువెళ్ళాడు. రెండుమూడు నెలలతరువాత ఒకసారి, సత్యేంద్రుడికి కోపంవచ్చి అన్నాడు. 'పుస్తకాలనిండా దుమ్ము పేరుకు పోయింది. సిరాబుడ్డిలో సిరా కాస్తా యెండి పోయింది___వీటిని చూసేవాళ్ళే లేరా యేమిటి?'

సంగతి తల్లి తెలుసుకుంది. ఈవిషయం హరదేవబాబువరకూ కూడాపోయింది. ఆయనవియ్యంకుని కోడలును తీసుకురావటానికి పురమాయించాడు. 'ఇక్కడ యింటిలో పెద్దవుపద్రవం బయలుదేరింది. బహుశాకోడలువస్తేనే కాని తగ్గేసూచనలు కనిపించటంలేదు. తప్పకుండా పంపించండి' అని వుత్తరంవ్రాసాడు.

తిరిగి సరళవచ్చింది. సత్యేంద్రుడికి కావలసిన యిటువంటి చిన్నపనులన్నీ సరళే చూస్తూండేది. పుస్తకాలు దులిపి సరిగాసర్దటం___కాలేజీకి వేసుకువెళ్ళే బట్టలు తయారుగా వుంచటం_తొందరలో రెండుచేతులకు వేరు వేరు కఫ్స్ పెట్టుకోకుండాను_భోజనం ఆలస్యం అయి, కాలేజీగంట కొట్టివేసారనే తొందరలో, ఒక కాలికి కాన్వాస్ బూటు, రెండవదానికి వార్నిష్‌బూటు తొడుక్కోకుండా చూడటం,_ శుభ్రమైన తెల్లటికోటుమీద యెక్కడనా మరకఅయితే, తుడవటానికి బ్రష్‌పుచ్చుకుని సిద్ధంగావుండటం,_యిటువంటి పనులన్నీ సరళ చేస్తూవుండేది. ఆమె లేకపోతే, మామూలుగా యిలాంటి వుపద్రవాలు వచ్చిపడుతూంటాయి. ఇంతటి అన్యమనస్కుడ్ని మనం యెప్పుడూ చూసివుండం. ఈ పనులన్నీ సరళ తప్పితే, యింకెవ్వరూ చెయ్యలేరు, చేసినా_ సత్యేంద్రబాబుకు మనస్కరించవు. అందుకని యీ పనులన్నీ సరళ చేయవలసి వచ్చేది.

*            *            *

సుశీల సరళకు పెద్దక్క. ఆమె కొడుక్కి అన్నప్రాసన. అందుకని కామాఖ్యచరణబాబు మనుమడి అన్నప్రాశనకు, కూతుర్ని తీసుకువెళ్ళటానికి కలకత్తావచ్చాడు.

సరళ అక్కగారు, సరళను మరదిగారిని తప్పకుండా రావలసిందని, బలవంతపెడుతూ వుత్తరం వ్రాసింది. అదీకాకుండా సరళ దిల్ జాన్ పూర్ వెళ్ళి మూడు సంవత్సరాలయింది. సత్యేంద్రుడుకూడా రావటానికి ఒప్పుకోవటముతోటే, కామాఖ్యబాబు, కూతుర్ని అల్లుణ్ణి తీసుకుని స్వగ్రామం చేరుకున్నాడు.

సరళతల్లి చాలారోజులకు కూతుర్ని, అల్లుణ్ణి చూసి చాలా సంతోషించింది. సుశీలవచ్చి పిచ్చాపాటీ చెప్పి, యిద్దరినీ చాలా సంతోషపెట్టింది.

శుభకార్యం నిర్విఘ్నంగా జరిగిన తరువాత, సత్యేంద్రుడు యింటికి వెళ్ళటానికి తయారయాడు. కాని మామగారు 'చాలారోజులకు వచ్చావు, ఇంకా రెండురోజులుండాలి, తప్పదు' అని బలవంతంచేశారు.

సరళకూడ వదలిపెట్టలేదు. అందుకని సత్యేంద్రుడు, అక్కడ నాలుగు రోజులవరకు వుండిపోవలసి వచ్చింది. నాలుగు రోజులూ గడిచిపోయాయి. అయినా సరళ వెళ్ళనివ్వలేదు. వెళ్ళకతప్పదు, చదువు పాడయిపోతుంది—పరీక్షలుకూడ యింకా యెన్నాళ్ళోలేవు. బయలుదేరేముందు సరళ అడిగింది. 'నన్ను మళ్ళీ యెప్పుడు తీసుకువెడతారు?'

"నువ్వు వచ్చినప్పుడు" అన్నాడు సత్యేన్.

'ఐతే, పదిపన్నెండు రోజులలో, తీసుకుపొండి.'

సత్యేంద్రుడు చాలా సంతోషపడ్డాడు. అతను యింతగా ఆలోచించలేదు కూడాను.

తిరిగి సరళ కన్నీటితో, భర్తను సాగనంపుతూ, అంది—'చూడండి—నన్ను యెప్పుడూ తలుచుకుంటూ వుండకండి—అదీ కాకుండా, రాత్రిళ్లు చాలా సేపు చదివి ఆరోగ్యం పాడుచేసుకోకండి.'

రాత్రిపూట పదిగంటలుదాటి చదవకుండా వుండేటట్టుగా, తనమీద ఒట్టు వేయించుకుని మరీవదిలిపెట్టింది సరళ. దుఃఖహృదయముతో. కలకత్తా తాను యెలా చేరుకున్నాడో, సత్యేంద్రుడికే తెలియదు.

సత్యేన్ ఒక పుస్తకం తీసుకుని కూర్చున్నాడు. దాని పేజీలతో, మనస్సుకు అనివార్య ద్వంద్వయుద్ధం ప్రారంభమయింది.

సత్యేంద్రుడు లెక్క పెట్టిచూసాడు. రోజల్లా తను చదివింది, అరవై పంక్తులు మాత్రమేనని తేలింది. విచారపడి 'యిక యిలా చదివితే, 'పాస్' అయినట్టే' అని అనుకున్నాడు. క్రమంగా మామూలు దుఃఖం, కోపంగా పరిణమించింది. అనుకున్నాడు_ 'యిదంతా అదుర్మార్గురాలు సరళ దే తప్పు. ఇవ్వాళిటికి వచ్చి ఐదురోజులయింది. ఏమీ చదవలేకపోయా. మొదట్లో అనుకున్నా_'చదువుకుంటూంటే విసిగించేది. పదిగంటలు దాటినతర్వాత చదవకుండా వుండాలని దీపం ఆర్పేసేది. అందుకని దాన్ని యెక్కడికన్నా పంపించి, హాయిగా చదువుకుందాం'_అని. కాని పరిస్థితులన్నీ తారుమారయాయి. రేపే తీసుకురావటానికి వెడతాను. సిగ్గుపడి, ఫేల్ అవుతానా యేమిటి?'

ఏమైనాసరే, యే విధంగా సరళను పిలిపించాలో, వుపాయం ఆలోచించటం మొదలు పెట్టాడు సత్యేన్. చెపితే యేమని చెప్పను? సిగ్గువేస్తుంది_ అది అంటే యింత ప్రేమ యెలా పుట్టింది? రెండు రోజులుకూడా...

ఇంతలో నౌకరు వచ్చి ఒక టెలిగ్రాం యిచ్చాడు. సత్యేన్ బిత్తరపడి పోయాడు. టెలిగ్రాం యెక్కడినుండి వచ్చిందా అని_యిప్పుడు ఆలోచించటానికి వీలు లేదు. కవరు తెఱచి చూడటంతోటే_ సత్యేంద్రుని హృదయం దద్దరిల్లింది. లోపల వ్రాసినవిషయం చూసేసరికల్లా, మెదడు ఒక్కసారిగా చెదరి పోయింది___సరళకు జబ్బుగావుందిట...

ఆ రోజుననే హరదేవబాబు, సత్యేంద్రుని తీసుకుని, దిల్ జాన్ పూరు వెళ్ళిపోయాడు.

ఇంటిలో అడుగుపెట్టకుండానే, కామాఖ్యబాబును కలుసుకున్నారు. హరదేవబాబుగారు కంగారుగా అడిగారు 'అమ్మాయికి యెలావుంది?'

హరదేవబాబు లోపలికివెళ్ళి చూసారు___సరళ మసూచిక రోగంతో పడివుంది. ఒక్కరోజులోనే గుర్తుపట్టలేనంతగా మారిపోయింది. కళ్లు చెదిరి పోయాయి. పద్మంలాంటి ముఖాన, నల్లటిసిరా పోసినట్టుంది. అనుభవజ్ఞుడు హరదేవబాబు గ్రహించాడు 'పరిస్థితి విషమంగావుంది.' కళ్ళు తుడుచుకుంటూ పిలిచాడు 'అమ్మాయి',

సరళ కళ్ళు తెఱచి చూచింది. అప్పటివఱకు కొంచెం స్పృహొచ్చింది.

'ఎలా వుండవన్నావ్'

సరళ నవ్వి అంది 'కులాసాగానే వున్నా'.

ఇద్దరూ తెలుసుకున్నారు, ఒకళ్ళనొకళ్ళు ఓదార్చుకున్నామని. అందరూ వెళ్ళిపోయినతరువాత, సత్యేంద్రుడు వచ్చి దగ్గఱ కూర్చున్నాడు. దారుణదుఃఖంవల్ల, నోట మాట పెకలి రాలేదు. అయినప్పటికీ ప్రయత్నపూర్వకంగా గద్గద కంఠంతో పిలిచాడు 'సరళా'.

ఎండిపోయి, క్షీణించిపోయిన కంఠస్వరం. ఐతేనేం—చిరపరిచిత స్వరమే. అదే ఆ పూర్వపు ప్రియమైన పిలుపు—సరళా. ఇందులో పొరపాటు, ఏం జరుగుతుంది కనుక. సరళ కళ్ళు తెఱచి చూచింది. మొదట్లో హర దేవబాబును చూచినప్పటినుంచీ, సత్యేంద్రుడు వచ్చివుంటాడని కొద్దిగా అనుమానించింది. సరళకు భర్తతో ఎగతాళిగా మాట్లాడటం చాలా సరదా. నవ్వి అంది 'యేం, తీసుకువెళ్ళటానికి వచ్చారా'.

నోరు కట్టుబడిపోయింది. ఇప్పటివఱకు సత్యేంద్రుడు కన్నీటిని, యేదో విధంగా ఆపుకుంటూ వచ్చాడు. సరళను చూడడంతోటే, ఆ ప్రవాహం కట్టు తెగిపోయింది.

ఇటువంటి సమయంలో యేడవకూడదని సత్యేంద్రుడికి తెలుసు. కాని ఆ దరిద్రపు కళ్ళకు, యీమాత్రం తెలిస్తే యింకేం? కన్నీటి బిందువులు ఒకదాని తరువాత ఒకటిగా క్రిందపడ నారంభించాయి, అవి యీనాడు సరళ శరీరంమీద పడి యింకిపోవడం మొదలుపెట్టాయి. ఇటువంటి అవకాశం వాటికి ఎప్పుడన్నా దొరికితేగా? సత్యేన్నుగాని, సరళనుగాని చూచి, వాటికి జడిసి, ఇటువంటి అవకాశాన్ని పోగొట్టుకుంటాయా? సరళ ఎప్పుడూ భర్త యేడుస్తుండగా చూడలేదు. తనుకూడా యేడ్చింది. చాలా సేపైనతరువాత కళ్ళుతుడుచుకుని అంది 'ఛీ, ఏడుస్తున్నారా? ఎక్కడన్నా మగవాళ్ళు ఏడుస్తారూ?'

'ఏమిటి?—సరళా బాగా తెలుసుకున్నావు. అంతర్వేదనలో, అవి ఎండి రాయిరాయైపోవాలి, కాని ఒక్క బిందువుకూడ బయటపడటానికి వీలులేదూ, కన్నీరు ఆడవాళ్ళకేనా? పురుషులకు వాటితో ప్రశక్తి లేదన్నమాట. మర్మ

వేదనతో మండిపో, కాని ఏడవబోకు. ఏడిస్తే అవమానవైపోతావు. సరళా, యీ నియమం మీజాతివాళ్ళే చేశారా?'

సరళ భర్తచేతిని, తన చేతిలోనికి తీసుకొని, గట్టిగా ఒత్తుతూ, ఏడుస్తూ అంది 'పునర్జన్మ వుందని ఒప్పుకుంటారా.'

సత్యేన్ ఏడుస్తూ అన్నాడు 'ఒప్పుకున్నానో లేదో, నాకే తెలియదు. కాని ఈనాటినుంచి తప్పకుండా విశ్వసిస్తా.'

సరళ ముఖంమీద నవ్వుచిహ్నాలు కొన్ని కనిపించాయి. మందు యిచ్చే వేళ అవటంచేత, కామాఖ్యాబాబు, హరదేవబాబు, డాక్టరు అగదిలోకి వచ్చారు. డాక్టరు నాడిచూసి చెప్పాడు 'ఆశ చాలా తక్కువగా వుంది. పైన భగవంతుడి యిష్టం'.

భగవంతుడి యిష్టప్రకారం, మరునాడు ఉదయం ఏడుగంటలకు సరళ స్వర్గస్తురాలయింది.

సాయంత్రం హరదేవబాబు, సత్యేంద్రుడ్ని తీసుకుని కలకత్తా తిరిగి వచ్చాడు.

*　　　*　　　*

ఏం, జరిగింది, యెవరికి తెలుసు, రాజశయ్యమీదపడుకుని, ఇంద్ర సుఖాన్ని కొద్దికొద్దిగా అనుభవిస్తున్నా, ఎవరో బలవంతంగా లేవనెత్తి, ఆ సుఖాన్ని మంటిలో కలిపేసారు. అర్ధరాత్రివేళ లేచికూర్చున్నా, నిద్ర మెలకువ వచ్చింది. నా జీవిత సహచరిణితో, సగం నాశనమయిన, ఆశయ్యమీద పడివున్నా. నేను యేడవాలా? నవ్వాలా? సుఖాన్ని పొగడుతూ, అనంతం వైపు ప్రవహిస్తున్నా, కాని యింతలో యెవరో, నాకు తెలియని, కొంతమంది ప్రజల కుట్రలో, చిక్కుకొనిపోయాను. బహుశా యెప్పటికయినా ప్రవహించి బయటపడతానో, లేదో? అంతాకూడా తారుమారయిపోయింది. జీవిత మూల స్థానమువరకు యెవరో నన్ను యీడ్చుకొని పోయినట్టుపోయి, ఆ హద్దులను దాటించి బయటకు, లాగుకొనిపోయారు. నాకేమీ తెలియటములేదు. అసలు యేం జరిగింది? నిశీధరాత్రిలో సత్యేంద్రుడు కిటికీవద్దకూర్చుని సాగర్ పురపు అంధకారాన్ని చూస్తున్నాడు. చెట్లన్నీకూడా సత్యేంద్రునితో, ఒక నిస్సబ్ధ భావాన్ని యేర్పరచుకుంటున్నాయి.

రయ్‌రయ్‌మంటూ చలిగాలి వీస్తూపోయింది. ఏమన్నా చెప్పిందా? ఎందుకు చెప్పదు? ఆ ఒక్కమాటే చెప్తుంది. ప్రతివస్తువుకూడా ఆమాటనే అంటాయి—యేం? జరిగింది?—బుల్ బుల్, యిప్పుడు ప్రియా, ప్రియా అని అనటం లేదు. సరిగ్గా దీనికి వ్యతిరేకంగా అంటోంది—'చనిపోయింది—' 'పిడకలియా', కూడ తనమాటల్ని సరిగా అనటములేదు. 'అమ్మాయి మాట్లాడు' అనటానికి బదులు 'అమ్మాయి చనిపోయింది' అని అంటోంది. ప్రతివస్తువూ ఆ ఒక్కమాటనే అంటూ ఆ స్తమానం యెందుకు అలా తిరుగుతాయి? ఆ 'రయ్‌రయ్'మని వీచే గాలికూడ సరిగ్గాయిదే అంటోన్నట్టుంది— 'లేదు, ఆమె లేదు.'—

సత్యేన్ యెలావుంది? తలనొప్పిగా వుందా? ఆ సంఘటనజరిగి యిప్పటికి చాలారోజులయింది. కొంచెంసేపు నిద్రపో బాబూ? ఎప్పుడూ, అలాగే ఆకిటికీదగ్గఱ కూర్చుంటావా? సత్యేంద్రుడు చీకటిలో, నక్షత్రాన్ని చూస్తున్నాడు. వాటిలో అన్నిటికంటె క్షీణ కాంతిగలదాన్ని, మరీ శ్రద్ధతో చూస్తున్నాడు.

కళ్ళు మూయటానికికూడా ధైర్యం చాలటంలేదు—అది యెక్కడికన్నా మాయమైపోతుందేమో—ఒకవేళ మాయమైపోతే—చూస్తూచూస్తూ అలసిపోయి అక్కడనే నిద్రపోతాడు. తెల్లవారిన తరువాత కళ్ళుతెరచి, మళ్ళీ దానినే చూడటానికి ప్రయత్నిస్తాడు. వెలుతురు అతనికి యిప్పుడు, యిష్టంగా వుండటంలేదు. వెన్నెలలో అసలు ఆనందమేలేదు. ఇంత క్షీణప్రకాశం గల నక్షత్రం, యింత వెలుగులో, యెక్కడన్నా కనపడుతుందీ?

సత్యేంద్రుడు యమ్. ఏ. తప్పాడు. పరీక్ష అవుదామనే కోరికకూడా అతనికి యిప్పుడులేదు. ఉత్సాహంకూడ అంతరించిపోయింది. పరీక్ష 'పాస్' అయితే నక్షత్రం యేమన్నా దగ్గఱకు వస్తుందా?

హరదేవబాబు పరివార సహితంగా, పల్లెకు తిరిగి వచ్చాడు. సత్యేంద్రుడితో అంటాడు 'ఇంటిదగ్గఱనే వుండు, పరీక్షకు బాగాచదువవచ్చు. పట్టణంలో, యింత అల్లరి, సందడిలో, చదువు కుదురుతుందీ' అని. సత్యేంద్రుడు యింకొక తరహా మనిషిగా మారిపోయాడు. అతనిముఖం చూస్తే, యెన్నో

రోజులనుంచీ, తిండానికి ఏమీ దొరకక, ఆకలితో, వున్నవాడిలా కనబడతాడు. ఏదో పెద్ద జబ్బుపడి యిప్పుడే కోలుకుంటున్న మనిషిలా వున్నాడు.

సరిగ్గా రెండుజాములవేళ, గదితలుపు గడియవేసి, సత్యేంద్రుడు ఫోటోలన్నీ శుభ్రంగాతుడిచి బాగుచేస్తాడు. తన పురాతన పుస్తకాలన్నీ సర్దుతూ, హారోన్నిసాయుసుపై మూతతీసి ప్రూరకనే దానిని తుడిచి పరిశుభ్రపరుస్తాడు.

సరళ శుభ్రంగాతుడిచిపెట్టిన పుస్తకాలన్నీ యింకా బాగా పరిశుభ్రపరచి, సరిగ్గా సర్దుతాడు. మంచిమంచి కాగితాలు, కలంతీసి, సరళకే వుత్తరాలు వ్రాయటం అతనిక అలవాటయిపోయింది. ఎడ్రసు యేమని వ్రాస్తాడో కాని, అన్నీ పెట్టెలోపెట్టి దాస్తాడు. సత్యేన్ నీవు ఒంటరిగాలేవు. ఎంతోమంది అదృష్టంకూడ నీలాగే చిన్న వయస్సులోనే, మండి బూడిదయిపోయింది. ఐతే, అంతా నీలాగే యిలా పిచ్చివాళ్ళయిపోయారా? సరిగ్గా ఆలోచించు సత్యేన్. అన్నిటికీ ఒక హద్దు వుంటుంది.స్వర్గీయ ప్రేమకుకూడ ఒకహద్దు నిర్దిష్టమై వుంది. హద్దుదాటి పోయావా,కష్టాలు పడతావు. ఎవ్వరూ కూడా రక్షించలేరు తెలుసునా?

సత్యేంద్రునితల్లి మంచి తెలివితేటలు గలది. ఒకరోజున భర్తనుపిలిచి నెమ్మదిగా అంది 'చూసారా, సత్యేంద్రుడు యెలా అయిపోయాడో?'

'చూస్తూనేవున్నా, మరి యేం చెయ్యను?'

'రెండవ పెళ్ళిచేయండి. మంచికోడలువస్తే, నాబాబు తిరిగినవ్వుతూ కులాసాగా వుంటాడు.'

ఆవ్వాళ సత్యేంద్రుడు భోజనం చేస్తూండగా, తల్లి అంది 'నాయనా, నామాట వింటావూ?'

'ఏమిటమ్మా?'

'నువ్వు మళ్ళీ పెళ్ళిచేసుకోవాలి.'

సత్యేంద్రుడు నవ్వి అన్నాడు 'అదా సంగతి, అయినా యింతవయస్సులో, యిదంతా యెందుకు?'

తల్లి మొదటనే కన్నీళ్ళు కూడబెట్టుకుని కూర్చుంది. అవి యిప్పుడు పిలవకుండానే క్రిందికి దిగనారంభించాయి. కళ్ళు తుడుచుకుంటూ అంది..

'నాయనా, యిరవై ఒక్కయేళ్ళ వయస్సుకూడా వయస్సేనా? కాని సరళ జ్ఞాపకం రావటంతోటే, యీ విషయాలు మాట్లాడ బుద్ధి వెయ్యదు. ఏమైనా యిక నేను వొంటరిగా వుండలేనురా బాబూ.'

మరునాడు వుదయంకూడ హరదేవబాబు, సత్యేంద్రుణ్ణి పిలిచి యీ విషయమే అడిగాడు. సత్యేంద్రుడు యేమీ జవాబివ్వలేదు. మౌనం అర్ధాంగీకార సూచకమనుకున్నాడు హరిదేవబాబు.

సత్యేంద్రుడు తన గదిలోకివచ్చి సరళ ఫోటో యెదుట నిలబడి అన్నాడు 'విన్నావా సరళా, నాకు పెళ్ళి అవుతుందిట'. ఫోటో యేమీ మాట్లాడలేక పోయింది. ఒకవేళ మాట్లాడినా, యేం చెప్తుంది కనుక? '[illegible]' ఇంతకన్న యింకా యేమంటుంది?

*            *            *

ఈసారి సత్యేంద్రుడి పెళ్ళి కలకత్తాలో జరిగింది. శుభదృష్టి సమయంలో చూశాడు 'మంచి అందమైనదే'. అందమైనది ఐతేనేం అతను అనుకున్నాడు,—నెత్తిమీద మళ్ళా ఒక 'బరువు' వచ్చిపడింది.

పెళ్ళి అయిన రెండు సంవత్సరాలవరకు, నళిని పుట్టింటిలో వుంది. మూడవయేట అత్తవారింటికి వచ్చింది. అత్తగారు చందమామలాంటి, కోడలు ముఖంచూచి, సరళను మరచిపోవాలని చాలవరకు ప్రయత్నించింది—తిరిగి యింటిపనులన్నీ, చక్కబెట్టుకో నారంభించింది. రాత్రిపూట నళిని, సత్యేంద్రుడు, దగ్గరగా పడుకున్నప్పుడుకూడ, ఒకరితో యింకొకరు మాట్లాడుకోరు.

నళిని అనుకుంటుంది 'ఇంత ముభావం యెందుకో.' సత్యేంద్రుడు ఆలోచిస్తూ వుంటాడు 'నా సరళస్థానంలో నిదురించటానికి యిది యెవరు?' అని. కొత్తకోడలు సిగ్గుచేత భర్తతో మాట్లాడదు—మాట్లాడకుండా వుంటేనే మంచిదనుకుంటాడు సత్యేన్.

ఒకరోజు రాత్రి సత్యేంద్రుడికి మెలకువవచ్చి చూచాడు—పక్కమీద ఎవరూ లేరు. సరిగ్గా దృష్టిసారించి చూస్తే, యెదుట ఒక మనిషి కిటికీదగ్గర కూర్చుని వున్నట్టు కనపడింది.

కిటికీ తెరిచివుంది. వెన్నెల లోపలికి పడుతోంది. ఆ వెన్నెట్లో సత్యేంద్రుడికి నళినిముఖం కొద్దిగా కనపడింది. పద్రమత్తులో, వెన్నెట్లో ఆమె ముఖం చాలా అందంగా వున్నట్లు తోచింది.

సరిగా చెవిఒగ్గి విన్నాడు_ నళిని ఏడుస్తోంది. పిలిచాడు 'నళినీ'___

ఉలిక్కిపడింది. భర్త పిలుస్తున్నారు. ఇంకా యెవరన్నా అయితే, యేమిచేసేదో కాని_ నళిని నెమ్మదిగా లేచివచ్చి దగ్గరగా కూర్చుంది.

'ఏడుస్తున్నావా? ఎందుకని?' అడిగాడు సత్యేన్. కన్నీటిధారి ద్విగుణీకృతమైంది. ఆమె పదహారేళ్ళ వయస్సులోనూ, భర్తనోటివెంబడి విన్న ప్రేమపూర్వకమైన మాట అది ఒక్కటే.

చాలా సేపటివరకు వెక్కివెక్కి యేడ్చి, కళ్ళు తుడుచుకుని, నెమ్మదిగా అంది 'మిమ్మల్ని చూడకుండా నేను యెందుకు వుండలేను?'

కారణం ఏమిటో తెలియదు, సత్యేంద్రునికికూడ లోపలినుంచి దుఃఖం పొంగుకువచ్చింది. దానిని అపుకుంటూ అన్నాడు 'చూడకుండా వుండలేవు. నీతో యెవరన్నారు? నిజంగా నిన్నుగురించి యెవరూ జాగ్రత తీసుకోవటం లేదు కదూ?'

నళిని మాట్లాడకుండా అన్ని మాటలు వింటూ కూర్చునివుంది.

సత్యేంద్రుడు కొంచెంసేపు వూరుకుని తిరిగి చెప్పటం ప్రారంభించాడు. 'ఈ సంగతి యెవరితోను చెప్పకూడదనుకున్నా. కాని అలా వుండడమువల్ల ఏమీ లాభం కనపడటంలేదు. నీ దగ్గర యేమీ దాచను. ఈ విధంగా యెందుకని వున్నానో అంతా నీకు చెప్పివేస్తా. ఇప్పటికీకూడా, నా మొదటిభార్య సరళను మరచిపోలేకుండా వున్నా. మరచి పోతాననే నమ్మకంకూడ లేదు. అసలు ఇష్టమనేదివుంటేగ. నీవు యీ అభాగ్యుడిచేతుల్లో పడ్డావు. ఎప్పటికన్నా నిన్ను సుఖపెడతాననే ఆశలేదు. అసలు యిష్టపూర్వకంగా నిన్ను పెళ్ళిచేసుకోలేదు ___అలాంటప్పుడు మనసారా నిన్ను ప్రేమించలేను కూడా_'

గంభీర అంధకారంలో, ఇద్దరుకూడా చాలా సేపటివరకు మౌనంగా కూర్చున్నారు. సత్యేంద్రుడు గ్రహించాడు___ నళిని యేడుస్తోంది. తనుకూడా యేడ్చాడా? ఒక్కొక్కటిగా సరళ మాటలు జ్ఞాపకం రావటం మొదలుపెట్టాయి. నెమ్మదిగా ఆమెరూపం హృదయంలో ప్రతిబింబితమైంది___అదే_

'తీసుకువెళ్ళటానికి వచ్చారా'—అన్నమాటలు జ్ఞప్తికి వచ్చాయి. పిలవకుండానే కన్నీరువచ్చి, సత్యేంద్రుడిదృష్టిని అడ్డుపరచింది. తనునాపినా నెమ్మదిగా, చెక్కిళ్ళమీదుగా క్రిందపడ మొదలుపెట్టాయి.

* * *

కళ్ళు తుడుచుకుని సత్యేంద్రుడు నెమ్మదిగా నళిని రెండుచేతులూ, తన చేతులలోనికి తీసుకుని అన్నాడు 'యేడవబోకు నళినీ యిందులో నా తప్పేముంది చెప్పు. రాత్రింబగళ్ళు నాలో నేను యెంతగా వేదనతో కుమిలిపోతున్నానో, యెవరికి, యేం తెలుసు! మనస్సులో చాలా వేదన, దుఃఖం, వుంది. ఎప్పుడన్నా ఒకవేళ యీ దుఃఖం వదలిపోతే, బహుశా నిన్ను ప్రేమించగలుగుతా. అప్పుడు నువ్వంటే కాస్త శ్రద్ధగా చూడగలుగుతాను.'

ఈ విషాదభరితమైన స్నేహపూర్ణపుమాట విలువని, యెంతమంది తెలుసుకో గలుగుతారు! నళిని మంచిబుద్ధిశాలి. భర్త దుఃఖాన్ని గ్రహించగలిగింది. తనను ప్రేమించటము లేదన్న విషయాన్ని ఆయన నోటివెంబడే విన్నప్పటికీ—ఆమె కోపగించుకోలేదు. పిచ్చిపిల్ల—పదహారేళ్ళ వయస్సులోనే కోపగించి, అలగకుండా వుంటే—మరి యింకెప్పుడు కోపగించుకుంటుంది? కాని నళిని—కోపగించటం, ప్రధానమా—భర్తముఖ్యమా—అన్న విషయాన్ని బాగా ఆలోచించింది.

ఆ రోజునుంచి భర్తదుఃఖాన్ని యేవిధంగా పోగొట్టాలో, ఆలోచించటము మొదలుపెట్టింది. ఏంచేస్తే ఆయన సవతిని మరచిపోతారు—ఈ విషయాన్ని ఒక్కసారిగా ఆలోచించి వదలిపెట్టెయ్యాలా. దుఃఖంలో, పాలు పంచుకుంటూ, కష్టసమయంలో, సానుభూతి చూపించుతూ, ఏదైనా విషాదవార్తను, నవ్వుతూగాని, శ్రద్ధగాగాని వినేవాళ్ళకంటె యీ ప్రపంచంలో బంధువులు యింకెవరుంటారు? ఈ సంగతి బాగా గ్రహించింది నళిని.

అప్పుడప్పుడు సత్యేంద్రుడు తన పూర్వపు విషయాలు వినిపిస్తూవుండేవాడు. ఆ మాటలే వింటూ, వినిపిస్తూ యిద్దరూ యెన్నో రాత్రులు గడిపివేసారు. సత్యేంద్రుడు వొక్కడే ఆ విషయాలు చెప్పుతూ—నళినికూడ భర్తమీదగల ప్రేమచేత శ్రద్ధగా వింటుంది.

* * *

రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. నళినికి యిప్పుడు పద్దెనిమిది సంవత్సరాలు నిండాయి. పూర్వపుకష్టం యిప్పుడు ఆమెకులేదు. భర్తవద్దనుంచి ప్రేమను బలవంతంగా లాగుకొంది. అటువంటి వాళ్ళకు దానినికూడ యెలా నిలబెట్టుకోవాలో, తెలిసే వుంటుంది. సత్యేంద్రనాథ్ పబ్లిక్కు డిప్యూటీ మేజిస్ట్రేటు అయాడు. భార్య అతన్ని గురించి తీసుకునే జాగ్రత్త, సేవలవల్ల మనిషి చాలావరకు మారిపోయాడు. ఆఫీసుపని అయినతరువాత, భార్యతో బాతాఖానీవేస్తూ, వేళాకోళాలు ఆడుతూ, కాలం గడిపివేస్తాడు.

మొత్తానికి సత్యేంద్రనాథ్ మామూలుమనిషి అయాడు. దొరకని వస్తువు కోసం మనిషి చాలా ఆతురత, ఆవేదన, చెందుతాడు. అసలు మనిషి స్వభావమే అంత:—నీవు అశాంతితో వున్నప్పటికీ, శాంతికోసం వెదుకుతావు—నేను చాలా సుఖంగా కాలంగడుపుతున్నా. కాని ఎక్కడినుంచి అశాంతిని లాగుకుని వచ్చి తెచ్చుకుంటానో, నాకే తెలియదు.

కపటాన్ని తెలుసుకోటం, మనిషికి స్వభావసిద్ధమైన గుణం. తప్పించుకుని పారిపోయినచేప, పెద్దదిఅవుతుందన్న నమ్మకమేమిటి? సత్యేన్ కూడ మానవుడే, అటువంటప్పుడు మనిషిస్వభావం యెక్కడికి పోతుంది? ఇంతప్రేమ, శాంతియుక్తమైన జీవనంలోకూడ అతని హృదయంలో, అప్పుడప్పుడు అశాంతి చిహ్నాలు గోచరిస్తూంటాయి. ఒక్క వూపుతో, మనస్సులో యేర్పడే యీ అశాంతిభావాల్ని పోగొట్టటానికి నళిని చాలావరకు శ్రమపడవలసివస్తుంది. మధ్యమధ్య ఆయనను సరిగ్గా సంబాళించలేనేమోనని కూడా అనుమానపడుతుంది. 'బహుశా, యిన్నాళ్ళటి యింత పరిశ్రమ, ప్రయత్నం, శ్రద్ధ అన్నీ వ్యర్థమైపోతాయా' అన్నసందేహంకూడ కల్గుతుంది. నళినిచేసే పనులలో కొంచెం అశ్రద్ధకనపడితే చాలు, సత్యేంద్రుడు, అనుకుంటాడు — సరళ అయితే యిలా యెన్నటికీచేయదు. అలా సరళ చేస్తుందో చేయదో ఆ భగవంతుడికే తెలియాలి—బహుశా ఆమె అసలే చేయలేక పోవచ్చును. లేకపోతే అంతకన్న రెట్టింపు నిపుణత్వం తో, చెయ్యనూవచ్చు. అయినప్పటికీ దీనివల్ల లాభంయేముంది? ఆచేప యెలానూ పారిపోయిందిగా. సత్యేన్ యిప్పటికీకూడ సరళను మరచిపోలేకుండా వున్నాడు. ఆఫీసునుంచి వచ్చేసరికల్లా నళిని కనపడకపోతేచాలు, వెంటనే అంటాడు—ఆమె యెక్కడ, యీమె యెక్కడ సహస్రాంశం, తేడా లేదూ?—

నళిని చాలా తెలివితేటలుగల మనిషి. ఎప్పుడూ భర్తనువదిలి వుండదు. భర్తయింకా సరళను మరచిపోలేదన్న విషయం, ఆమెకు బాగా తెలుసు. ఒక్కసారిగా మరచిపోతే బాగుండును అనే ఆలోచన ఆమె మనస్సులోకి యెప్పుడూ రాదు. పాపం, వ్యర్థంగా యెప్పుడూ తలచుకుని బాధపడతాడు_ అందుకని యెప్పుడూ దగ్గరనే వుండాలని ప్రయత్నించుతుంది. మరచిపోరు_ అయినప్పటికీ తనను అగౌరవంగా చూడరు. నళినికి, భర్తదగ్గరనుంచి యీమాత్రపు అనుగ్రహం వుంటేచాలు, ఇక యేమీ అక్కరలేదు.

పబనాలో, గోపీకాంతరాయ్ ప్రసిద్ధవకీలు. కలకత్తాలో, వారియిల్లు నళిని యింటిదగ్గరనేవుంది. ఏదో దూరపు చుట్టరికంకూడా వుండటంవల్ల, నళిని ఆయనను బాబాయిఅని, ఆయన భార్యను పిన్ని అని పిలుస్తుంది. రాయ్‌గారి భార్య తరచు వీళ్ళయింటికి వస్తూవుంటుంది. వకీలు బాబుకూడ అప్పుడప్పుడు వచ్చి క్షేమసమాచారాలు కనుక్కుంటాడు. ఊళ్ళోవున్న బంధువు వకీలుగారంటే, సత్యేన్ కూడ చాల గౌరవంగా చూస్తాడు. ఇద్దరియిళ్లూ దూరంగా వున్నప్పటికీ, వీరిలో మంచిస్నేహం, బాంధవ్యం యేర్పడిపోయింది.

నళినికూడా, అప్పుడప్పుడు బాబాయిగారింటికి వెళ్ళుతుంది. అసలు అలా వెళ్ళటానికి కారణంకూడా లేకపోలేదు. బాబాయిగారియిల్లు_అదీ కాకుండా వారి అమ్మాయి హేమాంగినితో, మంచిస్నేహంకూడవుంది. చిన్నప్పటి స్నేహితురాలు_ వొకరినివిడిచి యింకొకరు వుండటానికి యిద్దరూ యిష్టపడరు. అవ్వాళ పన్నెండు గంటలయింది. సత్యేన్ ఆఫీసుకువెళ్ళాడు. పనియేమీ లేకపోవటం చేత, నళిని బొమ్మలుగీయటానికి కూర్చుంది. కాని యింతలో వొకబండిచప్పుడు చేసుకుంటూవచ్చి డిప్టీమేస్ట్రేటుగారి యింటిముందు ఆగింది.

"ఎవరు, వచ్చింది? హేమాంగి నేమో" ఇంక ముందుకు ఆలోచించవలసిన అవసరం లేకపోయింది. పెద్దగా అట్టహాసంచేస్తూ హేమాంగినివచ్చి, నళినిజుట్టు వొక్కసారిగా పట్టుకుని అంది "ఇప్పుడు, గదువ్రా, గిదవ్రా యేమీ పనికిరాదు. లే, మాయింటికిపోదాం, నిన్న వదిన వచ్చింది."

"వదిన వచ్చిందా, వెంట తీసుకురాకపోయావు!"

"ఎలా తీసుకురమ్మంటావు, కొత్తగావచ్చిందాయె, ఒక్కసారిగా మీయింటికి యెలావస్తుందేం" అంది హేమ.

"నేనుమాత్రం యెందుకు వస్తాను."

"ఎందుకని రావు, రాకపోతే నా, బలవంతంగా, యీడ్చుకుపోతా."

పట్టుపట్టుకుని యీడ్చుకుపోతే, నళిని కాదు. యింకెవరైనాసరే, వెళ్ళవలసివస్తుంది. పర్యవసానంగా, నళినికి వెళ్ళక తప్పిందికాదు.

వెళ్ళేటట్లయితే, నళినికి చాలా కష్టాలు వున్నాయి. తిరిగి రావటంలో, చాలాఆలస్యం అవుతుంది. ఒకటిరెండుసార్లు నళిని రాకముందే సత్యేన్ ఆఫీసునుంచి యింటికివచ్చేసాడు. ఆటువంటి పరిస్థితులలో, సత్యేన్‌కు చాలాకోపం వస్తుంది. ఆయన ఏమన్నా అనుకున్నా, అనుకోకపోయినా, నళిని చాలా సిగ్గుపడుతుంది. దానికి కారణం ఆమెకు బాగా తెలుసు. ఆఫీసునుంచి రావటముతోటే, నళిని నిమురుతూంటే, ఆగాలివల్ల కలిగే సుఖాన్ని అనుభవిస్తేనే కాని, సత్యేన్‌కు అలసటపోను.

దేవుడికోరికవల్ల-ఎంత ప్రయత్నించినప్పటికీ, యివ్వాళకూడ యేడుగంటలకు ముందుగా యింటికి రాలేకపోయింది. వచ్చిచూసింది—సత్యేన్ పేపరు చదువుతున్నాడు. ఇప్పటివరకు టిఫిన్ తీసుకోలేదు. దగ్గరకు రావటంతోటే, సత్యేన్ నవ్వాడు—ఆ నవ్వు నళినికి సహజమైనదిగా తోచలేదు. అంతర్గతంగా భయపడింది టిఫిన్ తెచ్చిపెట్టింది—కాని సత్యేన్ దానిని ముట్టుకోలేదు. బొత్తిగా ఆకలిలేదన్నాడు. ఎంతో బ్రతిమాలినప్పటికీ, యేమీతినలేదు. కోపం వచ్చిందని తెలుసుకుంది నళిని.

* * *

హేమాంగిని యీరోజున అత్తవారింటికి వెడుతోంది. ఆమె భర్త ఉపేంద్రబాబు తీసుకువెళ్ళటానికి వచ్చాడు. నళిని చాలారోజులనుంచి, హేమను కలుసుకోవడానికి వెళ్ళటంలేదు. అందుకని హేమ చాలావిచారంతో, బ్రతిమాలుతూ రావలసిందిగా ఉత్తరంవ్రాసింది.

భర్త అనుమతిలేకుండా, యెక్కడికీ వెళ్ళకూడదని, నళిని ప్రతిజ్ఞ చేసుకుంది. ఇవ్వాళ ఆ ప్రతిజ్ఞను నిలబెట్టుకోవాలనుకుంటే, స్నేహితురాలిని కలుసుకోవటం సంభవించదు. మొత్తానికి, గట్టిచిక్కులోనే పడింది. హేమవ్రాసింది—మూడుగంటలబండికి వెడుతున్నానని—అప్పుడు భర్తదగ్గరనుంచి అనుజ్ఞతీసుకోవటంయెలా? బాగా ఆలోచించుకొని, నళిని వెళ్ళటానికే, నిశ్చయించుకుంది.

వెళ్ళేముందు దాసీదానితో, సరిగ్గా మూడుగంటలకు, రాయ్‌బాబుగారి యింటికి బండిపంపించమని చెప్పి వెళ్ళిపోయింది. ఇంటికెళ్ళగానేనుంచి బండివచ్చి నప్పటికీ, నళిని రాలేకపోయింది. హేమ మూడుగంటల బండికి అత్తవారింటికి వెళ్ళలేదు—అందుకని నళినినికూడ హేమ వెళ్ళనివ్వలేదు. మొండిపట్టు పట్టినప్ప టికీకూడ నళిని యింటికి రాలేకపోయింది. హేమ వెళ్ళిపోతోంది—మళ్ళా యెన్నాళ్ళకి కలుసుకుంటారో, యేమో, సరిగ్గా తెలియదు—సులభంగా యెలా వదలిపెడుతుంది?

ఇంటికి వెళ్ళటంలో, ఆలస్యం అయితే భర్తకి కోపంవస్తుందని చెప్ప టానికి నళిని సిగ్గుపడింది—అదీ కాకుండా సహజంగా యీమాట యెవరన్నా చెప్పటానికి ఒప్పుకుంటారుకనుకనా? ఇంతవయస్సులో—అఖరుకు యీవిషయం కూడా చెప్పివేసింది. కాని హేమ నమ్మలేదు. నవ్వి అంది "నళినీ, నన్ను పతిమూర్ఖురాల్ని చెయ్యబోకు. కోపతాపాల విషయం నేను బాగాయెరుగుదును. ఉపేంద్రబాబుగారికి కూడ కోపగించటం బాగా తెలుసు."

ఆమెమాటకు హేమ నవ్వుతూ త్రోసివేసింది. కాని నళినికి మాన సికంగా కష్టంకలిగింది. అందరిభర్తలూ వొకేవిధంగా, ఉపేంద్రబాబులాగ వుంటారా?

నళిని యింటికివచ్చేసరికల్లా రాత్రి పదిగంటలయింది. బాబుగారు బయట పడుకుని, నిద్రపోయినట్టు తెలుసుకుంది.

మాతంగిని, నళినితో పుట్టింటినుంచి వచ్చిన దాసీ. నళిని అంటే దానికి చాలాప్రేమ. అందుకని నళినిని చెడామడా తిట్టింది. ఇంటిలోని అందరికన్నా ఆమెకు ఒక్కదానికే తెలుసును—సత్యేన్ బాబుకు కోపంవచ్చి వీధిగదిలో, పక్క వేయమన్నాడని.

గంభీరమైన రాత్రిపూట, పక్కమీద కళ్ళుమూసుకుని, పడుకుని సత్యేన్ తన మొదటిభార్యను స్మరించుకుంటూ, ఆ సుఖాలను జ్ఞాపకంచేసుకోవటం, మొదలుపెట్టాడు. ఆమెకూ నళినికీ రూపరేఖలలో కాని, యేవిషయంలోనైనా సరే, సాదృశ్యంవున్నదేమో—అని. సరళప్రేమ ఎదుట 'నళినికిగల ప్రేమ, సముద్రంయెదుట గోష్పాదమంత నీటినిగాపోల్చి చూసుకుంటున్న సమయంలో, తలుపు తెరచుకుని నళిని లోపలికి వచ్చింది. సత్యేంద్రుడు కళ్ళు తెరచి నళిని

రావటం మానేశాడు. కాళ్ళతట్టున మంచంమీద కూర్చుంది. సత్యేంద్రుడు కళ్ళు మూసుకున్నాడు. ఇలా కొంతకాలం గడిచిపోయింది. ఇదంతా చూసేసరికల్ల సత్యేంద్రుడికి కోపంవచ్చింది. పక్కకు ఒత్తిగిలి పరుషస్పష్టస్వరంతో అన్నాడు, "నువ్వెందుకు వచ్చావు?"

నళిని ఏడుస్తూండటముచేత మాట్లాడలేకపోయింది. ఏడుపుమాని డిప్టీ మేజస్ట్రేటుగారికి కోపం, యింకా యెక్కువై మరింతకోపంగా, అన్నాడు 'చాలా రాత్రయింది, పో, లోపలికిపోయి పడుకో.'

నళిని ఏడుస్తూ, యీసారి కళ్లు తుడుచుకుని అంది 'మీరు, రారూ?'

సత్యేన్ తల అడ్డంగా ఆడించి అన్నాడు 'నాకు నిద్రముంచుకు వస్తోంది. ఇప్పుడు లేవలేను.'

ఏడిస్తే సత్యేంద్రుడికి కోపంవస్తుంది. నళిని కన్నీరు తుడుచుకుంది. భర్త యెదుట యిక యేడవదు. నెమ్మదిగా కాళ్ళమీద చేతులువేసి అంది 'ఈసారికి నన్ను క్షమించండి. ఇక్కడ మీకు చాలా యిబ్బందిగా వుంటుంది, లోపలికి రండి.'

సత్యేంద్రుడు ప్రతిజ్ఞచేసాడు. అందుకని లోపలికి వెళ్ళలేదు. 'ఇంత రాత్రి గడిచినతర్వాత కష్టసుఖాలు విచారించవలసిన అవసరంలేదు. వెళ్ళి, నిద్రపో, నేనూ పడుకుంటాను' అన్నాడు.

సత్యేంద్రుడ్ని, నళిని బాగా అర్థంచేసుకుంది. మాట్లాడకుండా, తన గదిలోకిపోయి, రాత్రంతా ఏడుస్తూనే గడిపింది. హేమాంగిని యేమయిపోయింది? ఒక్కసారి చూడటానికన్నా రాదే. కోపతాపాలు బాగా తెలుసునట—యిప్పుడు యీ పోట్లాట పోగొట్ట కల్గుతుందేం?

రెండవరోజు కూడా సత్యేన్ యింటిలోకి రాలేదు. అసలు నళినికి కనపడనేలేదు కూడాను.

నళిని ఒక ఉత్తరంవ్రాసి మాతో (మాతంగిని) కిచ్చి పంపింది. సత్యేన్ దానిని చూడకుండానే చించివేసి అన్నాడు 'యిక యిటువంటివి తీసుకు రాకు'.

నాలుగైదురోజుల తరువాత, నళిని పెద్ద అన్నగారు నరేంద్రబాబు పబనాకు వచ్చాడు. అకస్మాత్తుగా అన్నగారిని చూచి నళిని సంతోషపడింది. కాని వెంటనే అంతకంటె అధికంగానే ఆశ్చర్యపడింది.

‘చిన్నయ్యా, యెలావచ్చావు?’

నరేంద్రబాబు నవ్వి, నళినితో అన్నాడు ‘యింటికి రావాలని నీవు యింతగా వుబలాటపడుతున్నావేమన్నా?’

‘ఉబలాటం!’___

ఈ మాటయొక్క అర్థాన్ని, నళిని వెంటనే గ్రహించింది. వెంటనే నవ్వి అంది ‘మిమ్మల్ని చూసి చాలా రోజులయింది, కదూ’

* * *

భర్త పాదాలకు నమస్కరించి, అన్నగారితో, బండియెక్కి నళిని, వెళ్ళిపోయినరోజున, రాత్రిపూట సత్యేన్‌కు కొంచెంగానూ నిద్రపట్టలేదు. ఇలా చేయకుండా వున్నప్పటికీ కూడ, యీసమస్య యేవోవిధంగా తీరిపోయేది___యీ ఆలోచనతో రాత్రల్లా గడిపాడు. చాలా రాత్రింతకు, అతని మనస్సు ‘యిప్పటికీ యింకా మించిపోలేదు బండిని వెనక్కి త్రిప్పించవచ్చు’ అనే ఆలోచనలతో నిండిపోయింది. కాని ఆత్మాభిమానం అడ్డురావటంవల్ల, నళినిని తిరిగి తీసుకురాలేకపోయాడు.

మాతో కూడ నళినితో వెళ్ళిపోయింది. ఈ యెడబాటుకు కారణం, ఆమెకు ఒక్కదానికే తెలుసు ఇంటిదగ్గర యీ విషయం, యేమాత్రమూ చెప్పవద్దని, నళిని, మాతోకు నచ్చజెప్పింది. నళిని అనుకుంది ‘ఈ విషయము వెల్లడి ఐతే భర్తకు అపకీర్తివస్తుంది. మంచిఅయినా, చెడుఅయినా, తనభర్తను చెడ్డవాడనటానికి యెవరికి హక్కు వుంది?’

పుట్టింటికివెళ్ళి నళిని, తల్లిదండ్రులకు నమస్కారంచేసింది చిన్న తమ్ముడ్ని యెత్తుకొని ముద్దులాడించి___యెన్నో పనులు చేసింది, కాని నవ్వలేకపోయింది.

తల్లిఅంది ‘నా నళిని ఒక్కరోజు బండిప్రయాణంతో, అలసటవల్ల వాడిపోయింది’. కాని ఆ వాడిపోయిన ముఖం తిరిగి యెప్పటికీ కూడ కోలుకోలేదు.

ప్రపంచంలో, సామాన్యంగా, స్వల్ప విషయాలవల్లకూడ, గొప్ప ఆపదలు కలుగుతూంటాయి. శూర్పణఖయొక్క సాధారణ చిత్తచాంచల్యంవల్ల, సువర్ణలంక నాశనమయింది. ఒక సామాన్య సరసాలాపాల కారణంగా, ట్రాయ్ రాజ్యం మన్నులో కలిసిపోయింది. మహారాజా హరిశ్చంద్రునకు కూడ, సాధార

ంత్రు కారణంవల్ల పదభ్రష్టుడయ్యాడు. ప్రపంచంలో, యిటువంటి దృష్టాంతరాలకు యేమీలోటులేదు. ఇక్కడకూడ ఒక మామూలు ఆత్మాభిమానం కారణంగా పెద్దవిపత్తు వచ్చిపడింది. సత్యేంద్రనాథ్‌కు, తప్పుపని చేసాననేదోషం, అంటగడితేమాత్రం, దానివల్ల ప్రయోజనమేముంది?

నళిని యెప్పుడూకూడ అభిమానపడలేదు—భర్తకు కష్టం కలుగుతుందనే, ఆలోచనతో, అన్నింటినీ సహించింది—కాని యిప్పటినుంచీ ఆమె యిక సహించలేకపోయింది. ఆమె అనుకుంది—యీ చిన్నకారణంవల్ల భర్త తనను వదలివెయ్యాలా? తనకు చావు నొంయకని రాను.

కఠోరమైన అభిమానంవల్ల, నళిని కృశించిపోవటం, మొదలుపెట్టింది. అక్కడ సత్యేంద్రుడిలో, అభిమానం తగ్గిపోయింది. ఒక్కగడియసేపు నళిని లేకపోతే, యేపనీజరగదే—అటువంటి మనిషిలో, ఆత్మాభిమానం, యెన్నాళ్ళని వుంటుంది. అభిమానం, ఘోరమైన కష్టానికి మూలమయింది. సత్యేంద్రుడు ప్రతిరోజూ ఓపా చూసేవాడు—బహుశా యివ్వాళ నళిని దగ్గరనుంచి వుత్తరంవస్తుంది. 'నన్ను తీసుకువెళ్ళండి' అని. శిరసావహించి తీసుకువస్తా. ఇంకెప్పుడూ యిటువంటి అనుచిత వ్యవహారం చెయ్యకూడదు, అని అనుకుంటాడు. కాని విధిని యెవరుదాటగలరు? జరగవలసిందేదో, జరిగేతీరుతుంది. మనమంతా క్షుద్రజీవులం. మనమేంచెయ్యగలుగుతాం? ఇప్పటికి ఆరునెలలు గడిచిపోయాయి. అభాగ్యురాలు ఒక్క వుత్తరంకూడ వ్రాయలేదు. సత్యేంద్రునిమనస్సు ని క్తిచెందింది, కాని మళ్ళా కుదుటపడలేదు. సత్యేన్‌కు అసహ్యంవేసింది. తగ్గిపోయిన ఆత్మాభిమానం మళ్ళా తలయెత్తింది. దానికితోడు కోపంకూడ హాజరయింది. హితాహిత విచేచనా జ్ఞానంలేకపోగా, సత్యేంద్రనాథ్ తనతప్పును తాను తెలుసుకోలేకపోయాడు. 'ఇంత అహంకారం వున్నవాళ్ళకు, ప్రతిఫలంకూడ అంతతీవ్రంగా పొందవలసివుంటుంది' అని ఆలోచించటం మొదలుపెట్టాడు.

ఎవ్వరుకూడ తమతమ తప్పుల్ని తెలుసుకోలేకపోయారు. సగంవరకు కలిసిన యిద్దరి హృదయాలుకూడ శాశ్వతంగా విడిచిపోయాయి. యౌవన ప్రారంభంలో, ముడుచుకుపోయిన లతను, యెవరో లాగిసరిచేసారు. కాని యిప్పుడు సహించలేక, అది తెగిపోయే సమయం సమీపించింది.

సత్యేంద్రనాధ్, నీది తప్పు అని అనటానికి వీలులేదు. ఆమె దోషి అని అనటానికి అంతకంటె సావకాశంలేదు. ఇద్దరుకూడ బాధపడ్డారు—తప్పుచెయ్య లేదు. తప్పు చూపించినట్లయితే, మనసులో ఆశ్చర్యద్వేషం వృద్ధిపొందుతుందో, ఆ భగవంతుడికి తెలియాలి; కాని మానుకోలేను. నీవు గ్రహించలేవు కూడాను. ఏ ఉద్దేశ్యంతో—ఏమి మహాత్కార్యాన్ని నిర్వర్తించాలనే కోరి కతో, మీరు పరిచితులను యీ తనకు తెచ్చారో, తెలియదు.

ఉద్దేశ్యం సఫలం కాదు—సఫలం పొందాలనే కోరికా లేదు. అసలు ఉద్దేశ్య మేమిటో సరిగ్గా తెలియకుండా వున్నది. ఇప్పటికీ యీ పిరికిహృదయం, ఏదో అమృతమయమైన ఆకాంక్షవల్ల హాహాకారాలు చేస్తోందో, గ్రహించలేకుండా వున్నాం. ఏం జరుగుతుందో, మొదటికని యీమాదిరి, అస్పృశ్యగతి, లక్ష్యహీన మైన ప్రాంతాలలో, ప్రచారితమౌతోందో, నిర్ణయించటానికివీలు లేకుండా వున్నది.

జరిగేదేదో, జరిగేతీరుతుంది—యిష్టపూర్వకంగా, మనస్సుతో, ద్వంద్వ యుద్ధం చేసినప్పటికీ, నీకు అపరాధంనుంచి ముక్తి కలిగించగలనుంటావా? ముక్తి యిస్తాననుకున్నావా, ఏం?

* * *

ఇంతటి అందమైన మంచికోడలుకూడ, కొడుక్కి నచ్చలేదు. ఇంటి యజమానురాలికి దుఃఖంకల్గింది. చందమామలాంటి ముఖంగల కోడలు వచ్చి నప్పటికీ, తను సరిగా గృహకృత్యాలు చేసుకుని, ఇంటిని సుఖప్రదంగా చేసుకో లేకపోయింది—యీసంగతి ఆలోచించుకుని, ఆమె చాలా విచారపడింది.

తల్లి చేసిన వందలకొలది ప్రయత్నాలుకూడ, కొడుకు మనస్సును సరిగా త్రిప్పలేకపోయాయి. ఇక వేరే ఉపాయమేముంది? 'కొడుక్కి నచ్చకపోతే యింక కోడలు ఏలా అవుతుంది? కొడుకు ఆదరించితేనే, కోడలుమీద గౌరవం కలుగుతుంది—ఇందులో మాత్రం నా తప్పేముంది? స్వయంగా చూసు కుని పెళ్ళిచేసుకుంటే నేను వద్దంటానా. ఇటువంటి మాటలు అనుకుంటూనే తన అభ్యాసంప్రకారం, వధువును ఆహ్వానించేందుకు ఉపయోగించే పాత్రను, అలంకరించటం మొదలుపెట్టింది.

హరిదేవబాబు, రెండున్నర వత్సరాలక్రిందట స్వర్గస్థుడయాడు. ఆవిషయం జ్ఞాపకం వచ్చింది. కళ్ళు నీటితోనిండిపోయాయి—మళ్ళీ అతని జ్ఞాపకం

వచ్చింది—కన్నీటివేగం మరీ హెచ్చిపోయింది. ఏం తెలుసు, యెలాంటికోడలు వస్తుందో, సత్యేంద్రుడికోండ్రి బ్రతికివుంటే ఆభాగ్యురాలికి ఇటువంటి పరిస్థితులు, చూడవలసిన అవసరముండేది కాదు.

... ... ...

సత్యేంద్రుడు పెళ్ళిచేసుకుని వచ్చాడు. తల్లి వధూవరులకు స్వాగతం యిచ్చి యిద్దరినీ గృహప్రవేశం చేయించింది. ఎఱ్ఱబారిన కళ్ళల్లో నీరు గిర్రునతిరిగింది. కళ్ళు తుడుచుకుంటూ అంది 'కళ్ళల్లో యేదోపడింది. మాటి మాటికి నీరు కారుతున్నాయి.'

గిరిబాల వత్తి పెడసరిస్వభావం కలది—ముఖ్యంగా నళినితో, బాగా పరిచయముంది. నెమ్మదిగాఅంది 'యింత వయస్సులోనే యిప్పటికి మూడుసార్లయింది. ఇంకా యిటువంటివి ఎన్ని జరుగుతాయో, ఎవరు చెప్పగలరు కనుక?'

ఈమాటలు సత్యేన్‌తల్లి, సత్యేన్‌కూడ విన్నారు. రేపు శోభనపురోజు.

పెద్ద ఆడంబరంతోసహా, ఒక విలువైన కానుక ఒకటి వచ్చింది—ఎక్కడినుంచి వచ్చిందో యెవరికీ తెలియదు. పెళ్ళికూతురుకు డక్కామస్లినుచీర, పంచెలు, దుప్పట్లు యిలాంటివి చాలావున్నాయి, ఆ కానుకలో. పెళ్ళికూతురు కోసం వచ్చిన బెనారసుచీరవంటి అందమైనది యింకొకటి యింతకుముందు, ఆవూళ్లో యెవ్వరూ చూడలేదు. అందరూఅడుగుతున్నారు 'ఎక్కడినుంచమ్మా, యీ కానుక?' సత్యేంద్రుడితల్లి మాటిమాటికి నీటిగుటకలు మ్రింగుతూ అంది 'ఎవరో సత్యేన్ స్నేహితుడు పంపించాడు.'

గృహిణి కన్నీటిని బలవంతంగా ఆపుకుని అసలుసంగతిదాచి, యేడుపు నవ్వులతో, వికాసపుముఖం పెట్టుకుని, సారె మిఠాయి అందరికీ పంచిపెట్టింది.

అందరూ తమతమవంతులు తీసుకుని వెళ్ళిపోయారు. వెళ్లేముందు రాజబాల అంది 'మంచి కానుక'. నృత్యకాళి 'ఎందుకు కాదమ్మా? భాగ్యవంతులకు సామాన్యంగా యిటువంటి బహుమతులే వస్తుంటాయి' అంది.

క్రమంగా, యీప్రసంగం సద్దుకుని పోయింతర్వాత, యోగమాయ నెమ్మదిగా అనేసింది 'సరేకాని, పెళ్లి మళ్లీ యెందుకు చేసుకున్నారో?' జ్ఞానదా జవాబిచ్చింది 'ఏం, తెలుసునమ్మా, మంచి అందమైన కోడలు. సంగతి యేమిటో ఎవరికి తెలుసు?'

దాసుమణి మంగలిపిల్ల. దానిస్థితి కొంచెం బాగానేవుంది. చూడటానికి

సత్యేణ్ణకు యేమిటి కానూ? నా మాటలు అన్నీ త్రోసివేయగలవేనా? నా మాట ఒక్కటీ వినడన్నమాట. నళినిని తిరిగి యింటికి తీసుకవస్తా. నా లక్ష్మికి యిటువంటి దుర్గతి పట్టటమేమిటి?

ఆరోజు సాయంత్రం తల్లి కొడుకునిపిలిచి అంది 'నళినిని తీసుకురా.'

కొడుకు తల అడ్డంగా ఆడించి అన్నాడు 'ఊహూం'

తల్లి ఏడుస్తూ అంది 'ఎందుకని రా? నా నళినిని ఊరంతా కళంకం యేర్ప రచి ఆడిపోసుకుంటున్నారు. నీవు దానికి భర్తవు— దాని గౌరవం కాపాడవు—'

'కళంక మేమిటి?'

'ఈ విధంగా వెళ్ళగొట్టి, తిరిగి పెళ్ళి చేసుకుంటే, మనం ఎవరి నోళ్ళు కట్టివేయగలం?'

'నోళ్ళు కట్టగలిగినా ప్రయోజన మేముంది.'

'ఐతే తీసుకురావన్న మాట'.

'ఊహూం'

తల్లి చాలా కోపగించింది. ఏవిధంగా కోపగించుకోవాలో, అప్పుడు ఎటువంటిమాటలు అనాలో, అన్నీ మొదటనే నిర్ణయించుకుంది. ప్రత్యవసానంగా ఆలోచించవలసిన అవసరం లేకపోయింది. 'ఐతే రేపేనన్ను కాశీకి పంపెయ్యి. నేను యిక్కడ ఒక్కముద్దకూడ ముట్టను' అని అంది.

సత్యేన్ పూర్వపు మనిషి కాడు. సహజ ఆదంపూర్వక భాగ్యం—అను కునే యిష్టవస్తువులు—అన్యమనస్కత—ఉచ్ఛహృదయం—నిర్మలహృదయంతో కూడిన వికసితముఖం—నళినిగొక్క అనేకవిధములైన ప్రయత్నాలు—అనేక దుఃఖాలతోకూడిన మనస్సుగల సత్యేంద్రనాథ్ యిప్పుడులేడు. సునాయా సంగా అన్నాడు 'నీ యిష్టంవచ్చిన చోటికివెళ్ళు. నేను యిప్పుడు యెప్పుడుగానీ, తీసుకురాలేను.'

సత్యేంద్రుడి నోటినుంచి యిటువంటిమాటలు వినవలసి వస్తుందని, తల్లి స్వప్నంలోకూడ అనుకోలేదు. ఏడుస్తూ వెళ్ళిపోయింది. వెళ్ళేముందు అంది 'నాకోడలు కులట కాదు. సరిగ్గా తెలుసుకో, పూళ్ళోవాళ్ళు యేమన్నా సరే. ఆమాట నేను యెంతమాత్రం నమ్మను'.

రెండవరోజున తల్లి సత్యేంద్రుణ్ణి పిలిచి చెప్పింది 'నీ స్నేహితుడు కానుక ఒకటి పంపాడు, చూశావా?'

సత్యేంద్రుడు తల ఆడించి 'ఊహూ, యే స్నేహితుడు పంపాడు?' అన్నాడు.

'నాకు తెలియదు, కూర్చో, పట్టుకువస్తా'.

కొంచెం సేపటిలో, ఒక 'ప్యాకెట్' తీసుకువచ్చింది. మంచి విలువైన బట్టలు. సత్యేన్ ఆశ్చర్యపడ్డాడు_'ఏ స్నేహితుడు, పంపించాడా' అని. బెనారసుచీర పరీక్షగాచూస్తూ, ఒకమూల కట్టబడిన వస్తువు ఒకదానిని చూశాడు. విప్పిచూశాడు___వుత్తరం.

వ్రాసిన అక్షరాలు చూచేసరికల్లా, సత్యేన్‌కు నుదటిమీద కత్తిపెట్టి పొడిచినట్లనిపించింది.

దానిలో___

'చెల్లీ, స్నేహపూర్వపు కానుక, తిరిగి పంపివెయ్యకు. నీ అక్క పంపిన దానిని స్వీకరించు'.

* * *

ఆ శోభనపురాత్రి పూలపాన్పు, సత్యేన్‌కు ముళ్ళపాన్పు అయింది.

* * *

యువకునిలో వుండే అభిమానాన్ని, కుర్రవాడిలో యెక్కడా చూడరు. సత్యేంద్రునిలాగ యింతగా అభిమానపడి, అనర్థం తెచ్చుకున్న కుర్రవాణ్ణి యెవరినన్నా చూశారా? చిన్నప్పుడు పుస్తకం పుచ్చుకుని ఆటలాడుకునేవాడిని. నాన్న చూసి ఒకసారి కొట్టాడు. దానిని అనుభవించాను. సత్యేన్ నీవు హృదయంతో, ఆటలు ఆడావు. మరి దానికి వచ్చేశిక్షకు జడుస్తావేం?

మీరంతా యువకులు. ప్రపంచమంతా మీకు సుఖమయం. ఐతే యీ సంగతి చెప్పండి___మీలో యెవరికన్నా, యెప్పుడైనా, జీవితం, వాస్తవంగా, భారమైనదిగా తోచలేదూ? ఎప్పుడన్నా జీవితప్రత్యేక గ్రంధి, ఒకటి శిథిలమై పోతే, మీరు దానిని పట్టుకోటానికి తయారవలా? మీకు అటువంటి అనుభవం కలగక పోయినట్లయితే, ఒకసారి సత్యేంద్రుణ్ణి చూడండి. ఈర్ష్యపడాలనివుంటే, చూసి స్వేచ్ఛందపూర్వకంగా ఈర్ష్యపడండి. అసూయపడండి కాని, సాను భూతి చూపించవద్దు అసూయపడండి_ఏమీ అనను. సానుభూతి చూపించేరు_ క్కసారిగా చచ్చిపోతా___

పాపి మరణించేటట్లయితే, ప్రాయశ్చిత్తాన్ని యెవరు అనుభవిస్తారు? సత్యేంద్రని జీవితంలో, ఒక్కొక్కరోజు, ప్రత్యేకంగా భరించరాని 'బరువు' తీసుకుని వస్తున్నాయి. రోజల్లా గుంజుకున్నప్పటికీ, ఆ 'బరువు'ను తీసివేసుకో లేకుండా వున్నాడు.

అనేకమైన తన జీవితాన్ని, మునిగిపోయినట్లుగా, సత్యేంద్రుడు అప్పు డప్పుడు, అనుకుంటూవుంటాడు. మునిగిపోక పోయినట్లయితే, యీ మాత్రమైనా— 'తన ప్రియురాలు నళిని పబనాలో, చరిత్రహీనురాలయింది. అందుకని భర్తచే, వదలిపెట్టబడింది.'

... ... ...

సత్యేంద్రునికి, వివాహమయి రెండునెలలయింది. ఇవ్వాళే ఆయనకు ఒక వుత్తరం, చిన్నపార్శిలు వచ్చాయి.

ఉత్తరం నళిని అన్నగారు నరేంద్రబాబు వ్రాశాడు.

'సత్యేన్ బాబూ—

"ఎక్కువ అయిష్టంతో, నిండివున్నప్పటికీ, నాకు ప్రియపాత్రురా లయిన, చెల్లెలు నళిని కారణంగా, యీ వుత్తరం మీకు వ్రాస్తున్నా. చనిపోయే ముందు, యెన్నోసార్లు చెప్పింది— ఈ వుంగరం తిరిగి మీకు పంపించమనికోరింది మీ పేరుగల, యీ వుంగరాన్ని పంపిస్తున్నా. దీనిని మీ క్రొత్తభార్యకు, అలంక రించవలసిందిగా, నా చెల్లెలికోరిక. బహుశా ఆమెకోరిక తీరుస్తారని, ఆశిస్తున్నా. చనిపోయేముందు, తన చెల్లెలు కష్టపడకుండా వుంటుందని ఆశిస్తూ, మిమ్మల్ని విశేషంగా తలచుకుంది—"

— శ్రీ నరేంద్రనాథ్

నళినికి ఒక పిల్లాడుపుట్టి చనిపోయినప్పుడు, సత్యేన్ ఆమె వ్రేలికి యీ వుంగరాన్ని, స్వయంగా తొడిగాడు. సత్యేన్‌కు, యీ విషయం, అసలుజ్ఞాపకం వున్నదంటారా?

సత్యేంద్రనాథ్ యిప్పుడు పబనాలో వుండటంలేదు. ఏ కారణంవల్ల నైతేనేం, సత్యేన్ తల్లికూడ కాశీ ప్రయాణం మానుకుంది. క్రొత్తభార్య పేరు విభు. విభు బహుశా క్రిందటిజన్మలో, నళిని చెల్లెలయివుంటుంది.

*

పండిట్ గోవిందవల్లభపంత్

# సౌందర్య దేవత

వాసవదత్తది, పూర్ణచంద్రునికంటెకూడా నిండైన సౌందర్యం—కమలం కంటె అతికోమలమైన శరీరం, వీణానినాదాన్ని తిరస్కరించే కంఠస్వరం, ఆమె సౌందర్యానికి వన్నెలు. లజ్జాభరితమైన ఆమెకళ్ళు, లేడినికూడా సిగ్గుపడేటుగా చేస్తాయి. స్వర్గసౌందర్యం తనయిష్టానుసారంగా...స్వయంగా తనచేతులతో, యీ సజీవ బంగారుబొమ్మను నిర్మించింది. ఇంతటి, ప్రపంచాన్నంతా మోహింపజేసే సౌందర్యం, మధుర రూపరాశిని యిచ్చికూడా ఆమెను వేశ్యగా జన్మింపజేయటం, విధాతపట్ల సమంజసమేనా? బురదలో కమలాన్ని, ముళ్ళమధ్య పువ్వుల్ని సృష్టించే ఆయనకే తెలియాలి ఆవిషయమంతా.

కోయిల కరుణాగానాన్ని, హృదయానికి హత్తుకుని, మందమారుతం తనయిష్టానుసారంగా వీస్తున్న ఆ వసంతారంభంలోని ప్రత్యూషకాలమందు, ఒక భిక్షుకుడు...భిక్షకోసం సువిశాల భవనద్వారంవద్ద నిలబడ్డాడు. అకస్మాత్తుగా వాసవదత్త దృష్టి ఆ బౌద్ధ భిక్షుకునిమీద పడింది. ఒకసారి చూసింది—పదిసార్లు చూసింది—ఇంకా చూస్తూనేవుంది.

అతనిపేరు ఉపగుప్తుడు. ప్రపంచదృష్టిలో భిక్షువు—స్వర్గీయదృష్టిలో రాజరాజేశ్వరుడు. మనస్సుకంటె శ్రేష్ఠమైన సువిశాల సామ్రాజ్యం యింకొకటిలేదు. ఉపగుప్తుడు తన మనోసామ్రాజ్యంమీద అధికారాన్ని సంపాదించాడు. రాజరాజేశ్వరుడు—ఇంద్రియాలన్నీ అతని ప్రజ.

ప్రపంచపు చంచలత్వం, అశాంతి అతనికి బాగాతెలుసు. కళ్ళు అచంచలంగా...శాంతంగా ఉన్నాయ్. స్వర్గీయమైన దివ్యకాంతితో అతనిముఖం ప్రకాశిస్తోంది. కాషాయవస్త్రాలు అపూర్వశోభను కలిగిస్తున్నాయ్.

తన సౌందర్యంతో, ప్రపంచాన్నే ఓడించగల వాసవదత్త, అతని ముందు పరాజితురాలయింది. అతని సౌందర్యంచూసి ముగ్ధురాలయింది. ఆమె పీతాంబరపు పమిటచెంగు తొలగిపోయింది, అలకట్టు పడిపోయి, దానిలో గ్రుచ్చబడిన పూలు నేలమీద పడిపోయాయ్.

ఉపగుప్తునిదగ్గరకువచ్చి అంది—"భిక్షూ!...పాత్రముందుకుపట్టు" భిక్షా పాత్రను ముందుకుచాచి, అకస్మాత్తుగా ఉపగుప్తుడు ఆశ్చర్యంతో అన్నాడు— "కాని, నీరెండు చేతులూ ఖాళీగాఉన్నాయి. అవి నాకేమి భిక్షనిస్తాయ్?"

"ప్రపంచంలో నీకు ఎక్కడాలభించని, ఇంతవరకు ఎవ్వరికీ యివ్వనటువంటి వస్తువును యీ చేతులు నీకు ప్రసాదించుతాయి" అంది వాసవదత్త.

"అంటే"

"ఈ చేతులు ఖాళీవి కావె"

"స్వర్ణభూషణాల్ని ఎంచేసుకుంటాను?"

వాసవదత్తఅంది "ఈ స్వర్ణభూషణాలు కాదు. అబోధ యువకుడా యీ చేతులు రిక్తంగాలేవు. ప్రేమాలింగనంతో పరిపూర్ణమైయున్నాయి. ఆ అలింగనమే నీకు యిస్తాను. ఆలోచించుభిక్షూ. ఏ వాసవదత్తకోసం రాజాధిరాజులు నిత్యం పరితపిస్తూ ఉంటారో...ఆ వాసవదత్త నీకు ప్రేమాలింగనాలను యిస్తుంది"

ఉపగుప్తుని ముఖభావాలలో మార్పుఏమీ కలగలేదు. వాసవదత్త మళ్ళీ అంది. "భిక్షాపాత్ర ముందుకుపట్టు, భిక్షగా నా హృదయాన్ని అర్పిస్తాను."

"దీని అర్థం" అన్నాడు ఉపగుప్తుడు.

"అంటే...యీ నీ సుకుమారదేహం భిక్షావృత్తికోసం, అద్వితీయ సౌందర్యం, ప్రపంచస్పర్శలేకుండా...ఎక్కడో వనాంతరాలలో నశించిపోవటానికాదు. రా...భిక్షూ, నాయింటిలోకి రా...ఈప్రపంచానికిరాణిని...నీకు దాసీని అవుతాను"

ఉపగుప్తుని వాంఛారహిత మొగంమీద జీర్ణించిపోయిన నవ్వుచిహ్నాలు గోచరించాయి. మాట్లాడకుండా ఊరుకున్నాడు.

వాసవదత్త విచారంతోఅంది—"జవాబుయివ్వు—భిక్షూ"

"అనేక కారణాలవల్ల యింకా ఆసమయం రాలేదనుకుంటాను" అన్నాడు ఉపగుప్తుడు.

"ఐతే ఎప్పుడు?"

"కొన్నిరోజులతర్వాత వస్తాను"

"కొన్నిరోజులతర్వాత వస్తావా?" వాసవదత్త లోలోపల్నే ఆలోచించడం ప్రారంభించింది—

"స్త్రీ అందానికి యింతటి అవమానమా__ఒక సామాన్యభిక్షువు తన సౌందర్యాన్ని తిరస్కరించాడు. చూస్తాలే...ఆరోజుకోసం నిరీక్షిద్దాం__"

ఉపగుప్తుడు తొందరగా విహారంవైపు వెళ్ళిపోయాడు. వాసవదత్త స్వర్ణవిగ్రహంలాగ...నిశ్చల దృష్టితో అతనివైపు చూడనారంభించింది.

## 2

తన స్వల్పజీవితగతిని చూపిస్తూ, సంధ్య తీవ్రగతితో వెళ్ళిపోయింది. శరత్కాలపు నిశ్చల ఆకాశంలో, చంద్రుడు తన చల్లటి వెన్నెలతో ప్రకాశిస్తున్నాడు.

దట్టమైన అడవి పాదాలనుకడుగుతూ, గంగానది ప్రవహిస్తోంది. రోజులా సంపాదించిన భిక్షాభారంతో నిండిన పాత్రతో, ఉపగుప్తుడు, ఆ అడవిలోనుంచి, తన మఠానికి తిరిగిపోతున్నాడు.

హింసాప్రవృత్తిగల ఆసింహంమీద, భగవాన్‌బుద్ధుని ఉపదేశాలకు ప్రభావం లేకపోయింది. దాని ప్రవృత్తిలో కించిత్తయినా మార్పు కలగలేదు. ఉపగుప్తుని చూడటంతోనే, అతనిమీదకు ఉరకటానికి సిద్ధమయింది. భిక్షు దాన్నిచూసి తన శిరస్సును వంచాడు.

ఉపగుప్తుడు సింహానికి ఆహారమవటానికి తయారయాడు...రెండవ పక్షంగా ఆసింహం అతన్ని చంపటానికి సిద్ధమయింది.

ప్రక్కనే దట్టమయిన పొదఒకటి ఉంది. దానిలో చిన్న కన్నంఒకటి... వసంతకాలపు సంపూర్ణ ప్రతిభకూడా, ఆ కన్నాన్ని సరిగా ఆకులతో కప్పలేక పోయింది. దానిలోనుంచి యీదృశ్యాన్ని ఒక వేటగాడు చూసాడు.

సింహం ఉపగుప్తునిమీదకు ఉరకటానికి సిద్ధమవటంతోటే, వేటగాడు తన బాణాన్ని వదిలాడు. పొదను చీల్చుకుంటూవచ్చి, ఆబాణం సింహాన్ని నేలగూల్చింది.

ఉపగుప్తుడు ఆశ్చర్యంతో నాలుగువైపులా చూసాడు. తన శ్రమ ఫలించినందుకు సంతోషిస్తూ వేటగాడు అతనివైపు వస్తున్నాడు.

విచారస్వరంతో అన్నాడు భిక్షువు "ఎంతటిపనిచేసావ్? ఆసింహం నీకేం అపకారం చేసింది? అకారణంగా దాన్ని హత్యచేసావ్..."

"సింహం...నిరపరాధి..." మనసులోనే అనుకున్నాడు వేటకాడు.

దయావిహీనమైన, తన కఠోరజీవితంలో, మొట్టమొదటిసారిగా, వేటకాడు యిక్కడే కరుణాదేవి దర్శనం చేసుకున్నాడు. ఒక బొమ్మలాగ చూస్తూ నిలబడి పోయాడు. ఉపగుప్తుడు తన దయాపూరితమైన దృష్టిని అతనిపై కేంద్రీకరింపజేసాడు. కళ్లుచూసాయి...హృదయసందేశాన్ని స్వీకరించాయి.

వేటకాడు తన బాణాన్ని, మోకాలితో రెండుముక్కలుగాచేసి గంగా ప్రవాహంలో గిరవాటేశాడు...నిర్దయత గంగలో కలిసిపోయింది. కఠోరత ఆఖరిసారిగా శ్వాసను పరిత్యజించివేసింది. భిక్షుకుని కాళ్లమీద పడి అన్నాడు..."ప్రభూ...ఇదే నా అంతిమ హత్య..."

ప్రసన్నవదనంతో _ ఉపగుప్తుడు ఆశీర్వదించాడు. నూతన ప్రపంచం లోకి వెళ్ళిపోయాడు వేటకాడు. కరుణ...అతనికి మార్గాన్ని నిర్ణయించింది.

నేలమీద పడిపోయిన సింహంవైపు చూశాడు ఉపగుప్తుడు. బాణం బాగా హృదయంలోకి గుచ్చుకుపోయింది. అతికష్టంమీద గంగవద్దకు తీసుకు పోయి గాయాన్ని కడగటం ప్రారంభించాడు.

గంగానది చంచలహృదయంమీద, సంగీత మాధుర్యాన్ని నాలుగు వైపులా వెదజల్లుతూ, ఒకనావ వేగంగా వస్తోంది. శరత్కాలపు నిర్మలమైన వెన్నెల బాగా ప్రకాశించుతోంది. అడవిలోనూ, నదీఅలలమీద...అపూర్వ శోభను అంకితం చేసింది.

సింహానికి సేవ చేయటంలో నిమగ్నుడయ్యాడు భిక్షువు. అదిబ్రతుకుతుం దనే ఆశ చాలా తక్కువగా ఉంది...ఐనా తనప్రయత్నాన్ని కొనసాగిస్తూనే యున్నాడు భిక్షువు.

అటువైపే వస్తోంది నావ. పాట యింకా స్పష్టంగా వినిపిస్తోంది. ఉపగుప్తుడు చూసాడు...పడవలో యింకెవ్వరూ కాదు ఉంది...రూపరాసి వాసవదత్త...చంద్రునితో తన దృష్టినికలిపి పాడుతోంది.

సింహం హృదయంలోనుంచి, బాణాన్నిలాగడానికి చెయ్యియెత్తాడు భిక్షు. అకస్మాత్తుగా పాట ఆగిపోయింది. నావ తీరానికి వచ్చేసింది.

ఆశ్చర్యపోయి నావలోనుంచే గట్టిగా అరచింది వాసవదత్త... "భిక్షూ...అదేం...పనిచేస్తున్నావ్? ప్రాణదానం చేసినప్పటికీ...యీ సింహం

ప్రాణాన్ని పొంది, తన జీవనదాతను గుర్తించలేదు... తెలుసా? నిన్ను నాశనం చేస్తుంది..."

ఉపగుప్తుడు అన్నాడు—"సుందరీ ... నువ్వు పొరబడుతున్నావ్. బాహ్య సౌందర్యంకల ఆ హింసాప్రవృత్తిసహితమైన పశువులకంటే, యిదేం అంత భయంకరమైంది కాదు. ఆ సౌందర్యమే ఆధారంగా, కామం, మానవుని హత్యచేసి... అతన్ని చెవిటివానిగా చేస్తుంది. తన ప్రతిభతో మానవుణ్ని ఖైదీగాచేసి...సర్వనాశనం చేస్తుంది. వాటన్నిటికంటె యీ సింహం, అంతటి భయంకరమైనది కాదు. చేతికి స్వర్ణమకుటాన్ని అలంకరించుకుని, నీటలాగ ఉన్న నిస్సార భోగలాలసత్వంకంటె క్రూరమైంది కాదు. దానివెనకనే మానవుడు తన ధర్మాన్ని మరచిపోయి...అనంత జన్మాలలో ... ప్రపంచాలలో... యింతటి కార్యాన్ని చేస్తుంటాడు..."

వాసవదత్తకు ఏమీ అర్థం కాలేదు. ప్రేమలో మునిగిపోయి...అంది "భిక్షూ...నీకోసం ఎదురుచూస్తూ ఉండిపోయా...నువ్వు రాలేదు...మరచి పోయావా?"

"మరచిపోలా...వస్తాగా...కొన్నిరోజులతర్వాత..." అన్నాడు ఉపగుప్తుడు.

"ఇప్పుడే...రా...భిక్షూ—ఇంతటి మంచి అవకాశం ఎప్పుడు దొరుకుతుంది. చంద్రుడు ప్రపంచాన్నంతా వెన్నెలతో ప్రకాశింపచేస్తున్నాడు. నువ్వు నాయింటిలోని అంధకారాన్ని పోగొట్టు భిక్షూ!"

"కొంచెంసేపు ఆగు..."అంటూ నెమ్మదినెమ్మదిగా బాణాన్ని తీయటం ప్రారంభించాడు.

వాసవదత్త అంది—"నీ సౌందర్యబాణంతో నన్ను గాయపరచావ్! ముందు నాకు ప్రాణభిక్ష పెట్టు..."

"సుందరీ...ధైర్యంగా ఉండు... నేను తప్పకుండా వస్తాగా..."

"ఎప్పుడువచ్చేది? నీకోసం నిరీక్షిస్తూ నా నేత్రజ్యోతి క్షీణించిపోయి... రోజురోజుకు...కాలం నా యవ్వనాన్నంతా నశింపజేసింతర్వాతనా?..." అంది వాసవదత్త.

ఉపగుప్తుడు ఆమెవైపుచూసి అనుకున్నాడు..."ఇంటలిజెన్సు ఉండి కూడ...గోతిలో పడిపోతోంది—"

వాసవదత్త మళ్ళీఅడిగింది___"ఎప్పుడువస్తావ్ భిక్షూ?"

"ఈజీవితంలోనే___"

"ఈజీవితంలోనా?...చాలా ఆలస్యంఉంది"

"ఐతే"

"ఈ క్షణంలోనే...అను"

"కాదు"

"ఈనెలలో..."

"ఈసంవత్సరంలోనే వస్తా...నిజం...నామాట నమ్ము" అన్నాడు ఉపగుప్తుడు.

"వేళ్ళమీద సంవత్సరాల్ని, శ్వాసతో క్షణాల్ని లెక్కపెడుతూంటాను" అంది వాసవదత్త.

వాసవదత్త వెళ్ళిపోయింది. చనిపోవటానికి సిద్ధంగాఉన్న సింహం హృదయంలోనుంచి...బాణం తీయటంలో నిమగ్నుడైపోయాడు భిక్షు___

# 3

శరదృతువువెళ్లిపోయింది. హేమంతం, శిశిరఋతువులు గడచిపోయాయి. కాని, ఉపగుప్తుడు రాలేదు. చాలాసార్లు కన్నీటితో...అతనికోసం నిరీక్షించింది...కాని అతను రానేలేదు. అనేకసార్లు శృంగారం చేసుకుంది...అంతా వ్యర్థమైపోయింది.

ఆహ్లాదమైన, సుగంధ...సంజీవనిని తీసుకుని ఆఖరికి వసంతంకూడా వచ్చింది. ఐనా అతను రాలేదు. పెట్టిన గడువుకూడా దాటిపోవచ్చింది. ఎక్కడా ఉపగుప్తుని జాడేలేదు. అతృప్త నయనాలతో...ఎప్పటికీరాని ఆ వ్యక్తికోసం ఎదురు చూసింది...అందరూ వచ్చారు. కాని రానిదల్లా అతడు ఒక్కడే!

గడువుగా ఇంకా రెండు నెలలున్నాయ్. ఒక్క నెలమాత్రమే... ప్రపంచపు యాత్రికుల నివాసస్థానంలో ఉన్న 'వర్షం'___యాత్రికుడు ప్రయాణానికి సిద్ధమయ్యాడు. శిశిరమునే కంబళీ భుజంమీద వేసుకుని, హేమంతమునే పక్క...మూటాముల్లె కట్టుకున్నాడు. వసంత కాలపు పుష్పవస్త్రాలను సంపాదించి, గ్రీష్మ కాలపు గొడుగు, చెప్పులు తీసుకున్నాడు. వర్షాకాలపు ఖాళీ

చెంబుతీసుకొని...యిక ఆఖరు వస్తువుగా శరత్కాలపు వెన్నెలను పోగు చేసుకోవటానికి తయారవటంతోటె వాసవదత్త కంగారుపడి అనేసింది___ "నిజంగా ...నాప్రియుడు యీసంవత్సరం...రాడా"

రాత్రిసమయం. ప్రపంచమంతా అంధకారంలో మునిగిపోయివుంది. కాని వాసవదత్త మహలు అనేక దీపప్రకాంతులతో వెలిగిపోతోంది. ఆ కిరణాలు స్వర్ణభూషణాలమీద ప్రతిఫలించి, ఆమె విలాసపూరిత వక్షానికి అపూర్వశోభను కలిగిస్తున్నాయ్. అసంఖ్యాకమైన ఆదీపాలు నక్షత్రాలలాగ వున్నాయ్. వాటిమధ్య వాసవదత్త ముఖం చంద్రునిలా ప్రకాశిస్తోంది.

ఆరోజున వాసవదత్త భవనంలో పెద్ద విందు జరుగుతోంది. ప్రేమికుడైన ఒక లక్షాధికారి గౌరవార్థం ఏర్పాటుచేయబడింది. ఒక ప్రక్కనుంచి సంగీతం___రెండవవైపునుంచి పానీయపు ప్రవాహం___ప్రవహిస్తున్నాయ్. మధ్య అభాగ్యుడు లక్షాధికారి మునిగిపోతున్నాడు.

సగంరాత్రి కాకముందే లక్షాధికారి పానీయం కారణంగా, పూర్తిగా స్మృతితప్పిపోయాడు. తనవస్తువు...యితరులది అనే జ్ఞానమే పోయింది. సంగీతం ఆగిపోయింది. దాసీలుఅంతా వెళ్ళిపోయారు. ఆ భవనంలో... వాసవదత్త...లక్షాధికారితప్ప యింకెవ్వరూ లేరు...కాదు...కాదు యింకొక పిశాచికూడావుంది ..వాసవదత్త నీడ...

నాలుగువైపులాచూసి, వాసవదత్త తన తలాటిదిక్కునుంచి...చిన్న కైజారు బయటకు తీసింది...రాత్రిపూట వేశ్యచేతిలో కత్తి...సంగీత మాధుర్యాన్ని ప్రసాదించే ఆ మొగం...పిడుగున్నికూడా వణికింపజేస్తుందా...

ఆ లక్షాధికారిని చంపటానికి తయారయింది. కత్తిని పట్టుకున్న చెయ్యి పైకి లేచింది...కాని "జాగ్రత్త! పైన భగవంతుడున్నాడు...అతనికన్నా భయపడు" అన్నట్లుగా అనిపించింది.

పాపాత్మురాలు_ ఆ మూగ హస్తం సంకేతాన్ని గ్రహించలేకపోయింది. లక్షాధికారి గుండెల్లో పొడిచింది___"అమ్మో" అని అరచాడు...ఆఖరుసారిగా___"మాయరాక్షసీ___"అనగలిగాడు.

రూపవతి రాక్షసి___సుకుమారు పిశాచి___తన జయంపట్ల ప్రసన్నురాలయింది. సరిగ్గా అదేసమయంలో___బయటనుంచి ఎవరో పిలిచారు___

"వాసవదత్తా"

భయంతో వాసవదత్త కిటికీ తెరచి అడిగింది.—“ఎవరు?” జవాబు అవసరం లేకపోయింది. కిటికీలోనుంచి పడే వెలుతురు ఆ వ్యక్తి మొగంమీద పడింది—భిక్షు ఉపగుప్తుడు.

సంతోషంతో అంది వాసవదత్త—“భిక్షూ–వచ్చావా?”

“లేదు—త్వరలో నేవచ్చేస్తా”

“ఐతే—యీ ఏదికానివేళ రావటానికి కారణం ?

“ఏమీ లేదు—నా విహారానికి వెళుతూ—నువ్వు జ్ఞాపకం రావటం వల్ల— నిద్రపోతున్నావో, ఏం చేస్తున్నావో కనుక్కుందామని వచ్చా”

“మేల్కొనే ఉన్నా”

“కాని నీరెండుకళ్ళు మూసుకుపోయి ఉన్నాయి. సరే–వెళుతున్నా–చాల ఆలస్యమైపోయింది.”

“ఆగు—నీకు నీప్రతిజ్ఞ జ్ఞాపకంఉందా?” అడిగింది వాసవదత్త.

“ఆ—ఉంది–”

“ఈ సంవత్సరంలోనే—నన్ను కలుసుకుంటానని వాగ్దానంచేసావ్”

“ఇంకా ఎన్నిరోజులు మిగిలిఉన్నాయ్?” అడిగాడు ఉపగుప్తుడు.

“ఒక్క పక్షం—మాత్రమే”

“తప్పకుండా యీలోగానే వస్తా”

“నువ్వు అబద్ధం ఆడుతున్నావ్—మోసగిస్తున్నావ్”

“అమితాభుని శిష్యుడు అబద్ధం ఆడడు—మోసగించటం అతని ఉద్దేశ్యం కాదు.

ఉపగుప్తుడు నిశీధపు అంధకారంలో కలిసిపోయాడు—వాసవదత్త కిటికీ తలుపు మూసివేసుకుంది.

# 4

డబ్బుకోసం వాసవదత్త లక్షాధికారిని హత్యచేసింది. ఈ రహస్యం వెల్లడి అయిపోవటంవల్ల, న్యాయస్థానంలో విచారణకై తీసుకురాబడింది.

సంపద ఆమెను దండననుంచి రక్షించలేకపోయింది. ప్రేమికులు, సౌందర్యము అన్నీ వ్యర్థమైపోయాయి.

అభాగ్యురాలికి, మరణదండన లభించలేదు. అదైతే అశాంతజీవనానికి_ శాంతి కలిగిస్తుందనే చెప్పవచ్చు. దండన కాదు__అది ఆశీర్వాదంకూడాను.

కురూపిని చేశారు. చంద్రమామలాంటి ఆమె మొగంనుంచి__కళ్ళు తీసివేసారు. ముక్కు, చెవులు కోసివేయబడ్డాయి. చేతులు నరికివేసారు... సంపదనంతా లాక్కున్నారు.

ఈ శిక్ష వినిపించినప్పుడు, దయార్ద్రస్వరంతో అంది__"వారం రోజుల వ్యవధియివ్వండి. నా ప్రేమికుణ్ణి ఒకనిని కలుసుకోవాలి. ఈవారం లోపలనే వస్తాడు. అతర్వాత సంతోషంతో, కటికవానికి, న్యాయానికి నా దేహాన్ని అప్పగిస్తాను__"

ఎవ్వరూ ఆమె ప్రార్థనను అంగీకరించలేదు. కటికవాడు కురూపినిచేసి రాజ మార్గంమీద వదలివేసాడు. చేసిన పాపాన్ని తెలియచెయ్యటానికి__ ఒకమనిషిని వెంటనే పంపించారు.

ఎంతో భయానకమైన దృశ్యం. కోసివేయబడిన భాగాలనుంచి రక్తం మాంసపుకండలు బయటికి వస్తున్నాయ్. ఈగలు ముసురుతున్నాయ్. చేతులు లేకపోవటంవల్ల_పాపం ఆమె వాటిని తోలుకోలేక__దీనంగా రోదిస్తోంది.

ఇంతకుముందు, ఆమె సౌందర్యాన్ని ఉపాసించినవారంతా, అసహ్యించుకుని, దూరంగా తొలగిపోతున్నారు. అంతా ఆమెమీద ఉమ్మివేస్తున్నారు. గ్రుడ్డి, కుంటి__కుష్ఠురోగి అయిన బిచ్చగాడు కూడా ఆమె స్పర్శనుంచి తప్పించుకోవాలని చూస్తున్నాడు.

ప్రపంచాన్నంతా మోహింపజేసే సౌందర్యం, యౌవ్వనం, ధనం__ఏదీ లేనప్పుడు, అందరిచేత అసహ్యించుకోబడి యమయాతనను ఆవిడ అనుభవిస్తున్న సమయంలో, ఉపగుప్తుడువచ్చి, ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

ఆశ్చర్యపడి అంది "ఎవరు?"

జవాబిచ్చాడు ఉపగుప్తుడు "నేను"

కంఠస్వరాన్ని కొద్దిగా గుర్తుపట్టింది. తన సంశయం తీర్చుకొనటానికి అడిగింది "ఉపగుప్తుడవా?"

"ఆఁ"

దీర్ఘంగా నిట్టూర్చి "తిరిగిపో—ఎందుకొచ్చావ్? నన్ను హేళన చెయ్యటానికా—" అంది.

"తిరిగి పొమ్మంటావా—? నీ మాటప్రకారం వచ్చాను. రావటంలో ఆలస్యం కాలేదు— సంవత్సరం పూర్తిఅవటానికి యింకా రెండురోజులున్నాయ్"

వ్యాకులపాటుతో అంది వాసవదత్త "వసంత సౌరభంలో నాదేహం వెల్లివిరుస్తున్న సమయంలో, నువ్వు రాలేదు. నా శోభాచంద్రుడు యీ ప్రపంచాన్నంతా ప్రకాశింపచేసినప్పుడు—నువ్వు రాకుండా ఆగిపోయావ్. నన్ను శిక్షించటానికి ఘాతుకుడు ఆయుధాలను తయారుచేస్తూండగానయినా రాలేకపోయావు. సౌందర్యదీపం ఆరిపోయింది. శోభ అంతరించిపోయింది. ఇటువంటప్పుడు ఎందుకువచ్చావ్?"

ఉపగుప్తుడు అన్నాడు—"సోదరీ!—ఇంద్రియసుఖం—స్వార్థ ప్రేరితుడనై నీదగ్గరకు రాలేదు. శారీరక సౌందర్యం వ్యర్థం. ఈ నీ శరీరమే దీనికి సాక్ష్యాన్నియిస్తుంది. సంపదకూడా అంతే — అయినా నీదగ్గరకు వచ్చాను — ఏం చెప్పాలని ఉందో — చెప్పు?"

వాసవదత్తకు జ్ఞానోదయమయింది. "ఏంచెప్పనుభిక్షూ—నీ ప్రశ్న—నా జవాబును నిర్మూలనం చేసింది. జ్ఞానం కలుగుతోంది — స్వప్నం— మరీచిక వెంబడి పరుగెత్తుతున్నట్టుగా అనిపిస్తోంది. చెప్పవలసినదేమీలేదు. నాకు దగ్గరగా కొంచెంసేపు ఉండు—బాధ తొలగిపోయినట్టుగా అనిపిస్తోంది. నీ మాటలవల్ల నా విచారం తగ్గిపోతోంది — భిక్షూ — నువ్వే ఏదైనా చెప్పు — వింటా"

ఉపగుప్తుడు చెప్పటం ప్రారంభించాడు—

ప్రపంచంలో తృష్ణ దుఃఖానికిమూలం. దీనికే దాసురాలివై నువ్వు ప్రవర్తించావు. కార్యసాఫల్యతకోసం — నీతిని వదలివేసావు. డబ్బుకోసం హత్యచేసావు — ఈరోజున విపత్సమయంలో—ఏవీ అవసరానికి వచ్చాయి కావు—

"భిక్షూ—పతనం చెందటానికి ముందుగావచ్చి— యిలా ఎందుకు చెప్పలేక పోయావు? — వచ్చావు కాని — చెయ్యిదాటిపోయింది" అంది వాసవదత్త.

# మీరంతా చదివి తీరవలసిన గ్రంథాలు

సినిమా స్క్రిప్టు సూత్రాలు

(106 పేజీలు గ్లేజు) 1 8 0

తారామండలం

(66 హిందీతారల జీవితాలు) 1 0 0

[illegible]

(ఫిలిం తమాషాలు) 0 12 0

వెన్నెల [illegible] (నవల)

(సినీతార చిత్రజీవితం) 1 0 0

సినిమా సన్యాసి

('సత్యవాన్' వ్యంగ్యరచనలు) 0 8 0

వివరాలకు, ప్రతులకు

చిత్రకళా ప్రచురణలు

సత్యనారాయణపురం, విజయవాడ-2